# తీరిక వేళలలో కూడిక చేసేపని



ఊరి పెద్దలు మెళకువతో అంతా ఏర్పాటు చేయడంవలన పూరీ జిల్లా (ఒరిస్సా) లోని తీసపూర్ గ్రామస్థులు తమ తీరిక వేళలలో పనిచేసి కొంత కూడబెట్టగలుగుతున్నారు.

అర్జున్‌దాస్ అనే ఆ వూరి యువకుడు ఒక బహుళార్థ సాధక సహకార సంఘం స్థాపించాడు. వడ్రంగి పనిలో శిక్షణ నివ్వడమే కాక, ఆఫీసులకూ, ఇతర సంస్థలకూ కావాల్సిన కుర్చీలు, మేజాలు, కిటికీలు, ద్వారబంధాలు తమ కార్ఖానాలో తయారుచేసి ఇస్తారు, ఈ సంఘంవారు.

ఈ సంఘం వారు ఏర్పాటుచేసిన కొబ్బరిపీచు పరిశ్రమకూడా ఇంత లాభకరంగానూ నడుస్తూంది. త్రాళ్లు, బరకాలు తయారుచేసి చుట్టుప్రక్కల గ్రామాలలో వీరు అమ్ముతూంటారు.

గ్రామీణ వృత్తులను ప్రోత్సహించండి - తద్వారా అత్యధికంగా ఉపాధి, ఆదాయ సౌకర్యాలు కలిగించండి

**ప్రణాళికకు సహకార మివ్వండి**
**మీ మేలుకు మీరు కృషిచేయండి**

DA 59/514

ఉస్మాన్‌పురా, కరీంనగరమునుండి జువ్వాడి గౌతమరావుచే ప్రకటితము.
ఉమా ప్రింటర్సు, విజయవాడ-1.




# జయంతి
# 16

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.



సంపాదకులు :

విశ్వనాథ సత్యనారాయణ

జువ్వాడి గౌతమరావు

సంవత్సర చందా 8-00

విడిప్రతి 75 న. పై.

# సంపాదకీయము

సంస్కృతపురోజులు పోయినవన్న మాటను గురించియే మరియు విచారింతము. ఎన్ని విధముల విచారించినను తద్వాక్యము సోపపత్తికముగా కనిపించదు. కానిఅట్లనుటకువీలున్నది. కొందరుభ్రాంతచిత్తులు నిస్సందేహాముగానట్లనుకొనవచ్చును. ఈవాక్యము పైకిచాల నిజమువలె తేలికైన మాటవలె ప్రచారముతోనున్న విషయమును నిరూపణచేయుచున్నదానివలె కనిపించి లోకమును ప్రతారించును. కాని గాఢముగా విచారించినచో సంస్కృతపు రోజులు పోలేదు, పోవు. ఎందుచేత పోవు? అన్నది ప్రశ్న.

ఎందుచేత పోవనగా నాగరకతయన్న విషయము పండితులమీద భావుకులమీద గాఢవిచారణ దక్షులమీద ఆధారపడియుండును. పరమేశ్వరుని యనుగ్రహమువలన పాశ్చాత్య నాగరకత యుపరివిషయముల నొక్కిదైనను నంతర్గాఢ విషయముల గొప్ప భావనాదక్షమైనది. అల్పమైనదికాదు. పాశ్చాత్యుల తత్త్వశాస్త్ర మవలోకించినచో వారిభావనాదక్షత విశదమగును. ఆధునికులైన శాస్త్రపరిశోధకుల (సైంటిస్టులు) భావనామార్గములు తిలకించినచో వారి యగాధమైన యాలోచనామార్గములు స్పష్టమగును. ఉదాహరణకు కొన్ని శాస్త్రములు తీసికొందము. భూగర్భశాస్త్రమున్నది. తచ్ఛాస్త్రవేత్తలు భూగోళము సుమారు నూటతొంబదియైదు కోట్ల సంవత్సరములకు పూర్వ మేర్పడియున్నదని చెప్పనేచెప్పిరి. మన పూర్వులు తదాది మానవు డీభూగోళమునందు నివసించుచున్నాడని నాడే నిత్యులైన ఋషులున్నారని అదియే కృతయుగాది ప్రథమ మనుకాలాదియని చెప్పిరి. ఇది భేదము. మానవు డీభూమిమీద నివసించుట కారంభించి కొద్దివేల యేండ్లయినదని పాశ్చాత్యమతముచెప్పగా పాశ్చాత్య శాస్త్రకారులు భూగర్భ విజ్ఞానాదిశాస్త్రముల యొక్క సాహాయ్యముతో సంతకంతకు వెనుకవెనుకకుపోయి మానవుని ఈధాత్రిమీది నివాసకాలము, నివాసకాలమేకాక నాగరికతకలిగిన మానవుని మనుగడ పాతిక ముప్పదివేలయేండ్ల వెనుకటివరకు నిర్ణయించుచున్నారు. ఆధునికమైన యే శాస్త్రమును తీసికొనినను మరియు ముఖ్యముగా భూగర్భ విజ్ఞానశాస్త్రమును భాషాశాస్త్రమును తీసికొన్నచో నీకాలము వెనుకవెనుకకు పోయి మన మూహించరానన్ని వేల సంవత్సరములకు పూర్వమే మానవజాతి నాగరకతా పరిపూర్ణమైయున్నట్లు తేలుచున్నది. మెక్సికోలో జేయబడిన త్రవ్వకములు మాయా నాగరికత ద్యోతకములని పూర్వమెప్పుడో తేలినది. స్పెయిన్ దేశీయులు తద్దేశముజయించిన నాటికే యచ్చటి సామ్రాజ్యములు తత్సాహసవీరులకు విడ్డూరము కల్పించినట్లు వారి వ్రాతలేయున్నవి. భారతదేశములో మొహంజోదారోహరప్ప త్రవ్వకములుగాని నిన్న మొన్న జరిగిన మధ్యప్రదేశములోని త్రవ్వకములుగాని నాగరకత కనీసము పాతిక వేల యేండ్లకు పూర్వమందే యున్నట్లు ఆధునిక శాస్త్రములు ఋజువుపరచుచున్నవి. మరియు భాషాశాస్త్రము కూడ నింతె పనిచేసినది. కాల్డ్వెల్ ద్రావిడ భాషా సిద్ధాంతమును తొలుత నిరూపించినాడు. దానిపైన నెన్నెన్నియో పరిశోధనలు

జరిగినవి. ఈ నాడా మార్గమున భాషావిషయక పరిశోధనలు చేసినవారు పలుమందికలరు. వీరందరు పాశ్చాత్యులే. అందరును మహా మేధావులు, విషయ విచారచర్చ చేసెడివారు కాని గాలిలో దీపముపెట్టి దేవుడా నీమహిమ యనెడువారు కారు. ఈ భాషాశాస్త్ర విషయములో 1వందయేండ్లకు పూర్వమున్న భాషా శాస్త్రవేత్తలు తత్కాలమందు భారతదేశ నాగరకతకంటె పాశ్చాత్య దేశముల నాగరకత మిక్కిలి పూర్వమైనదనిగాని గొప్పదనిగాని యనిపించుకొనుటకు కొంత యత్న బుద్ధితో ప్రవర్తించినవారు కలరేమో యని చెప్పవచ్చును. కొందరినిగురించి ఈమాట నిస్సంశయముగా ననవచ్చును. వారిలో పనేకులు భారతదేశగత నాగరకతయు ఇచ్చటి సంస్కృత భాషయు తొలుత తొలుతనే దివి యెల్లెనను ఈ దేశపు ప్రతిభను తగ్గించవలయునని చేసిన ప్రయత్నములు తత్వాక్యములు కలవు. వారిని వదలినచో నేటి పాశ్చాత్య దేశములయందలి భాషాశాస్త్రవేత్తలు నిష్పాక్షికమైన బుద్ధితో యథార్థ పరిజ్ఞానము గొనుటకు పాటుపడుచున్న దీక్షతో పలుగ్రంథములు వ్రాయుచున్నారు.

మనశాస్త్రములలోని మేలిమి యొకవిధముగా మనదేశములో నడుగంటినది. ఒక పండితు డన్నట్లు నేడు మనదేశములోని శాస్త్రాది పాండిత్యము లెట్లున్నవనగా వ్యాఖ్యాగ్రంథగత పాండిత్యము లేగాని మూలసూత్రగత పరిజ్ఞాన ప్రాధాన్యము తగ్గిపోయినది. చాల యంతరించినది. శిక్ష వ్యాకరణము నివి రెండు భాషకాయువుపట్లు. వానినిగురించి తొలినాళ్ల సంస్కృత భాషావిషయమున జరిగిన మహా పరిశోధనలు నేడు లోపించినవి. వ్యాకరణ శాస్త్రమునుగురించి నేటివరకు నూత్న నూత్న గ్రంథములు వెలువడుట లేదనుటకు వీలు లేదు. పూజ్యులై నిత్యస్మరణీయులైన శ్రీహరిశాస్త్రి శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రిగారలే ప్రమాణము. గురుప్రసాదమును కొనసాగించిన శ్రీ పేరి వేంకటేశ్వర శాస్త్రిగారు ప్రమాణము. శిక్షవిషయమున నిట్టి ప్రవాహము భంగమైనది. పాశ్చాత్య విద్వాంసులు తద్విషయకమైన పరిశోధనలు చేయుచున్నారు. నేటికి పరమ ప్రమాణమని చెప్పకోదగిన బ్లూముఫీల్డు అన్న పండితుడు వ్రాసిన గ్రంథము శిరోధార్యము కాదగినది. ఆయన తన గ్రంథములో పాణినిని గురించి వ్రాసిన పంక్తులు చదివినచో సంస్కృతభాషా దినములు పోయినవని యెవడనగలడు?

అన్ని దేశములయందు నాగరకతయొక్క యే మార్గమున ప్రసరించుచుండును. ఆ నాటి మహానుభావులైన మేధావులు మహావిషయములను భావింతురు. వానిని రాజు లాచరింపింతురు. వారి ననుసరించెడి వివేకమైన దేశము తమ నాగరకతను వారి భావముల ప్రకారము తీర్చిదిద్దుకొనును. పాశ్చాత్య నాగరకత వారి మత విశ్వాసములు కొన్ని తీసి ఇవతలపెట్టినచో తద్దేశీయులైన తత్త్వవేత్తలు చేసినది. ఈ విషయము వేరే నిరూపింపదగినది. నేటికైనను తద్దేశములందలి మహానుభావులైన తత్త్వవేత్తలయు మేధావులయు భావనావిశేషమువలననే వారి సాంఘిక రాజకీయములైన పరిణామములు జరుగుచున్నవి. సామ్యవాదము వచ్చినదనగా నొక మేధావియైన మార్క్సుయొక్క మేధావిలాసము. అది ప్రజలలోనుండి పుట్టలేదు. ప్రజాగితములైన బహుదేశముల పర్యాలోచనమువలన నతడు చేసెనని చెప్పినచో నే మేధావియైన నవ్వచేయును.

ఏ సంస్కృతపు దినములు మనకు పోయిన

వనుకొనుచున్నామో ఆ సంస్కృతభాష
యందు పూర్వమునందు వ్రాయబడిన మహా
గ్రంథములలోని మహావిషయములనే నేటి
పాశ్చాత్య మేధావులు తిరిగి యుద్ఘాటించు
చున్నారు. వానిని వేయినోళ్ళ ప్రశంసించు
చున్నారు. ఏ విజ్ఞానశాఖనైనను ఆ మార్గము
లందు వృద్ధిపొందించ వలయుననుచున్నారు.
వారిని లక్ష్యభూతులుగా గ్రహించవలెనను
చున్నారు. భాషాశాస్త్రము చూచినచో
దానిలో వ్యుత్పత్తిశాస్త్రముయొక్క జ్ఞానము
ధాతువులయొక్క తొలస్థితి వానిని తెలిసి
కొనుట, దాని తెలివిడిచేత సర్వభాషయు
ప్రదీపించుట మొదలైన పలువిషయములు
పరమ ముఖ్యములైనవి. ఈ మార్గమునందు
మార్గదర్శకములైన గ్రంథములు మార్గదర్శక
ములేకాక గీర్వాణభాషకు సంబంధించినంత
వరకు పరమ ప్రమాణభూతములైనవి శిక్ష
వ్యాకరణశాస్త్రములు. పాణిన్యాచార్యుల
యొక్క స్థితి అప్రతాన్యమైనది. బ్లూమ్
ఫీల్డు మొదలైన పండితులకు మార్గదర్శకమై
శిరోధార్యమగుచున్నది. నేడు సంస్కృతమును
కాదన్నచో నాధునిక మహావిద్వాంసుల
కాళ్ళకు సంకెలలు వేసినట్లగును. ముందుకు
సాగుచున్నామన్నది జండాలుపుచ్చుకొనినడు
నెడి మాటకాదు. ఆమహావిద్వాంసుల నను
సరించవలసినమాట.

ఇంతకు వచ్చిన యిబ్బందియేమనగా నేటి
ప్రపంచనాగరకత త్రిస్థానాపతితముగా నడచు
చున్నది. పాశ్చాత్యదేశమొకటి. అచ్చటి
మహాపండితులు చేయుచున్న పరిశోధన శంకు
స్థానము. రెండు దీనికాధారభూతమైనది
భారతదేశ పూర్వసంస్కృత నాగరకత. ఆ
నాగరకత పొందిన పరమోన్నతస్థాయి. ఆధు
నిక పాశ్చాత్యవిద్వాంసులెటు తిరిగి యాకట్టు
కంబమునకే పోవుచున్నారు. మూడవది
ప్రాచ్యదేశములు. ఈ దేశీయులు నడిమికాల
పు పాశ్చాత్యవిద్వాంసుల పరిశోధనలమీద
నాధారపడిన కొన్నియల్పభావ తరంగములను
సంఘమునందు జీర్ణింపజేసికొని యుత్తమ పరి
శోధనా ఫలితముల నెఱుంగబోక కొన్ని
యేండ్లక్రిందట పాశ్చాత్యసంఘముమీద తేలి
యాడిన నాచువంటి భావములను పట్టికొని
తెప్పలు తేలుచున్నారు. ఈ సంధిదశ భారత
దేశమునకు నేడు క్లేశకారిగానున్నది. జాగ్ర
త్తగా సర్వశాస్త్రపరిశోధకుల పరిశోధనా
రహస్యములు ఫలితములు విద్యాబుద్ధితో
జ్ఞానబుద్ధితో స్వీకరించి యానందించుటపోయి
వందయేండ్ల క్రిందటి పాశ్చాత్యసంఘోపదిష్ట
ములైన యల్పభావములకు ప్రామాణ్యము
సిద్ధింపజేసికొని నేటిపలుమంది యకాండతాండ
వముచేయుచున్నారు. అందుచేత సంస్కృత
పురోజులు పోయినవనుకొనుచున్నారు. అవి
పోలేదు. పోవు. మానవునిసృష్టిలో మేధావిల
సనము భాసింపజేయు పరమేశ్వరానుగ్రహ
మున్నంతవరకు అట్టిపండితులు ఇగ్లండులో
పుట్టుదురు. అమెరికాలో పుట్టుదురు. భారత
దేశములో పుట్టుదురు. తదితరుల సంఖ్య
యెక్కువ. వారు సర్వత్రపుట్టుదురు.

ఇంకను పాశ్చాత్యులలో ఖగోళశాస్త్ర
విజ్ఞానము పూర్వభారత దేశమునందువలె
విజృంభించలేదు. కొంత పెరిగినది. ఆగినది.
వారిశాస్త్రములు వృద్ధిపొందుటలో నొక
లక్షణమున్నది. వారు శాస్త్రములను శాస్త్ర
దృష్ట్యా వృద్ధిపొందింతురు. లౌకికులు తన్మ
హామేధావుల పరిశోధనాఫలితములను తమ
లాభముల కుపయోగించుకొనుచున్నారు. ఈ
మహాదుఃస్థితి యీ దేశములలో నున్నది. పర
మాణువును బ్రద్దలుకొట్ట విజ్ఞానవంతులు

నేర్చిరి. దానిని లౌకికాధికారులు జననాశనమున కుపయోగించుకొనిరి. నేడా దేశములగూర్చి విచారించినచో, నిట్టివి వందలు. పూర్వ భారత దేశ నాగరకతా స్థితి యిట్టిది కాదు. మహర్షులు మహావిషయములను దర్శించిరి. తద్దర్శనము సంఘదృష్ట్యా చేసిరి. సంఘజీవన రహస్యముగా వారు వానిని మార్చిరి. దర్శనము, దాని యొక్క సంఘమునందలి ప్రతిబింబనము రెంటి యొక్క ఏకీకృతి యొక్కసారిగా పూర్వ ఋషుల యొక్కయు నాటి మాంధాతృ ప్రభృతులైన మహారాజుల యొక్కయు నేకీకృత బుద్ధిచేతి సాధ్యమైనది. నేడు పాలకుల స్వరూపము వేరు. శాస్త్రవేత్తల స్వరూపము వేరు. అన్నానికన్నము మజ్జిగకు మజ్జిగ. దూరాజ్యవాంఛా కలుషిత చిత్తులైన నేటి పాలకులు పరిశోధనా సమర్థులైన విద్వాంసులను తమగుప్పిళ్ళలో బెట్టుకొని యాడుచున్నారు. సంఘముమీద విద్వాంసుల వెలుగు పడుట లేదు. పాలకులన్న రంగద్దముల్లోనుండి యాస్వచ్ఛమైన వెలుగు సంఘముమీద వికృతివర్ణముగా భాసించుచున్నది. భారతీయ విశ్వవిద్యాలయములందలి చదువులు కూడ నెప్పటికప్పుడు జరిగిన మహావిద్వాంసుల పరిశోధనా ఫలితములను తెలియచేసెడు ప్రయత్నములే చేయుట లేదు. సాహిత్యము చెప్పినను ప్రకృతి శాస్త్రములు బోధించినను భాషాశాస్త్రము చెప్పినను చరిత్రము చెప్పినను అర్థశాస్త్రము చెప్పినను వందయేండ్ల క్రిందినాటి పాశ్చాత్య పరిశోధనలు నాటి దుర్భావపూరితములైన విశ్వాసములు చెప్పబడుచున్నవి కాని మరొకటి చెప్పబడుట లేదు. ఈ దేశమునకీ దుఃస్థితి పట్టినది. మన చరిత్ర తిరిగి వ్రాయబడుట లేదు. మన విద్యాపద్ధతి తిరిగి నిర్మింపబడుట లేదు. మన భావములు పునశ్శీలితములగుట లేదు. వందయేండ్ల క్రిందినాటి, నాటిదొరతనము నాటిన విత్తనములే నేడు విత్తబడుచున్నవి. ఇది తెలగీసిన చదువు. ఈ చదువు దేశమున నిల్పియుంచబడినంతవరకు విద్యార్థుల మనస్సులు వికసించవు. వారే యువకులగుచున్నారు. వారే రాజకీయవేత్తలగుచున్నారు. మహావిద్వాంసుల యొక్క మహా పరిశోధనల ఫలితములకు వెలియగుచున్నారు. వానినిగూర్చి యోజించెడి యోగ్యత లేకున్నారు. మేకుబందీ చేసిన మనసులతో నూహించుచున్నారు. సిద్ధాంతములు ముఖ్యమైపోవుచున్నవి. జ్ఞానతృష్ణ కనిపించుట లేదు. ఈ స్థితిలోనున్నది. ఇట్టివారు సంస్కృతపు దినములు పోయినవని యెందుకనరు? పోయినవో ఉన్నవో ఈ మహావిద్వాంసుల యందా సంస్కృత ప్రభావము మరింత గాఢమగుచున్నదో వారు చదివిన చదువులో లేదు. వారికి ప్రచారము చేయబడిన విషయములలో లేదు. ఇది దుఃస్థితి. మరియు సంస్కృతపు రోజులుపోకూడదు. ఎందుకు పోకూడదో ముందు వ్రాసెదము. పోయినచో మానవుని సృష్టి వ్యర్థమగును.

రుక్మిణీనాథశాస్త్రి

# మంజీరం

సనాద్యవత్యాః కమనీయ పాదా
శ్రితస్తులా కోటి రలం విభూత్యై ।
దదాతు మహ్యాం సుకవిత్వధారాం
యయా భవానీ మహ మాశ్రయిష్యే ॥

రాజత్కృపా పాయా మణిహంసకో మే
నా నాగ్ర బుద్ధేశ్చ పరిష్కరోతు ।
ధియం సుతీక్ష్ణా మవిచంచలాంచ
వాచం మనోజ్ఞాం వరమార్థ సిద్ధ్యై ॥

పాదాంగదం మే విదధాతు భద్రం
నిశ్శేష విశ్వేశ్వర ధర్మపత్న్యాః ।
మంజీర నా దాను భవేన యేన
తృణాయ మన్యే విభవాష్టకం నై ॥

పురారి నారీ చరణే విలగ్న
స్సనూపురానంద ధురా వహేన్నః ।
ఆధ్మాతచిత్తస్య మమాద్రికన్యా
పాదాంగదం దీవ్యతు ధర్మమేఘే ॥

పదే ప్ర దీవ్యన్నిఖిలైకమాతు
ర్మంజీర మేతర్హి శుభాయ భూయాత్ ।
దేదేత శాంతిం సుకృతప్రియేభ్యః
స్మరారినారీపదకింకరేభ్యః ॥

వజ్రేశ్వరీ పాదతలా శ్రయం య
న్మంజీర మా శాస్య మపి బ్రవీతు ।
నిరాశ్రయాణాంచ నిర ర్థకానాం
ధర్మచ్యుతానాం విపదిస్థితానాం ॥

శ్రీ నీలకంఠ ప్రియ కంఠ మాలా
పాదాంగదం సర్వ సుఖాయ భూయాత్ ।
చండ ప్రచండాగ్ని మహోమృధే ఽస్మి
న్నిరుద్య మే భ్యశ్చ కృతోద్యమేభ్యః ॥

స్మయేస మానేన నిరాదరేణ
ప్రవర్తయామాస నిహాత్య దైవం
భువంతు విజ్ఞాన ముపైతి నాశం
యధేంద్ర శత్రు స్స్వాంతతో పరాధాత్ ॥

విశ్వాంబికా నూ పుర మద్య జోషం
కర్ణేతు లోకస్య కరోతు ఘోషం ।
మంజీర మాకర్ణ్య యుగాంత కాలే
లయార్ణవం తే కృతిన స్తరేయుః ॥

కూజత్ప్రికైః బాలక శిష్య సంఘైః
శబ్దాయ మానామ్ర వనైః వసంతైః ।
వర్తిష్య తే భూమి రథాద్రి కన్యా
శింజాన మంజీర మయైర్గతాం తైః॥

విశ్వనాథ సత్యనారాయణ

# ఒకడు నాచన సోమన్న

నా కల్పవృక్షములో పూర్వకవిస్తుతి పరమైన సీసపద్యములో 'నొకడు నాచన సోమన్న' యని వ్రాసితిని. ఆ పద్యములో తక్కిన పూర్వకవుల ప్రస్తావనచేయుచు నొక్కరొక్కరినిగూర్చి యెక్కువ భాగము వారి శైలీప్రాధాన్యమునుగూర్చి చెప్పినట్లు తెలియగలదు. ఇద్దరు ముగ్గురనుగూర్చి మాత్రమే శైలీప్రస్తావన చేయబడలేదు. నాచన సోమన్ననుగూర్చి చేయబడినది శైలీప్రస్తావనకాదు. అతడొక్క డనుటచేత నతనిసాటి యతడేయని యర్థము. అతడే కైకరథుడనియర్థము. ఆంధ్ర సారస్వతాకాశమున నతడు శుక్రగ్రహము వలె ప్రత్యేకముగా నిలుచున్నాడని యర్థము. అతనినిగూర్చి నాకు తెలిసిన దానినిబట్టి యతడే కైకరథుడని నేను నిశ్చయించుకొన్న విషయము. దానినీ వ్యాస పరంపరయందు వ్రాయబోవుచున్నాను.

నాచన సోమన్ననుగూర్చి భిన్నాభిప్రాయములు కలవని నాకు తెలియును. కొందరీతనిని తిక్కన్నకంటె గొప్పవాడనుట పూర్వము కలదు. కొందరు పెద్దలే ఇతనిని కాదన్నవారు కలరు. అయినను నా యభిప్రాయము నేను చెప్పుటకు వెనుదీయవలసిన యవసరములేదు. ఈ కాలమున గవితా విమర్శ యొక తెన్నున పోవుటలేదు. ఒక యేబదియేండ్లక్రింద పింగళి సూరన్నగారి కంతగౌరవము లేదు. నేటికాయనకున్నంత గౌరవము మరి యేకవికి నున్నట్లు కనిపించుటలేదు. అట్లే నాచన సోమన్నకు నాడుగల మహాగౌరవము నేడున్నట్లును కనిపించుటలేదు. ఇట్లు కవులయొక్క ప్రశస్తి తారుమారగుటకు కారణములు పెక్కులు కలవు. వానిలో ప్రధానమైనది విమర్శసిద్ధాంతములు. ఒక నవలవలె కథ చెప్పుటలోని నేర్పు సర్వోత్కృష్టమైనదని భావించిన పద్ధతి చేత కళాపూర్ణోదయము మహోత్కృష్టమైన గ్రంథమైనది. ఆ నేర్పు కానరాని తక్కిన గ్రంథములు సహజముగా నీనాటికి తక్కువ వెల కట్టబడుచున్నవి.

పాశ్చాత్య విమర్శ సూత్రములను పట్టించి నేడు గ్రంథములయొక్క వెలలు కట్టుచున్నారు. అట్లే పాశ్చాత్య విమర్శ సూత్రములలో ప్రధానమైన దొకటియున్నది. అది యేదనగా నా గ్రంథము నా కవి యే యూహాలతో ఏ విమర్శ సూత్రములతో నే సిద్ధాంతములతో రచించెనో యా సూత్రములను ఆ సిద్ధాంతములను పట్టించి చూచి యా కావ్యమును పరామర్శింపవలయును. ఇట్లు చేయుటకు తొలుత సకావ్యమును జాగ్రత్తగా పఠింపవలయును. ఆ కావ్యమునందే సూత్రము లిమిడియున్నవి, ఆ సూత్రము లెంతవఱకు తత్కావ్యమునందు నాచరణకు దేబడినవి, అట్లు చేయుటలో కవియొక్క ప్రతిభ యెంత భాసించుచున్నది. తొలుత నీ విమర్శ జరిగిన తరువాత గవి యిచ్చట జరితార్థుడయ్యెనని యనిపించుకొన్నచో నితని సూత్రములతో బెరకవుల సూత్రములను పోల్చి చూచి కవితా దృష్టితో నే సూత్రముల కధికమైన విలువకలదో నిర్ణయింపవచ్చును. మరియు నీ సోమన్న విషయములో గొన్ని విషయములు నేటి విమర్శ సూత్రముల యా

ధారము లేకుండ నిర్ణయింపబడజాలవు. ఇతడు తన గద్యమున దాను 'నవీన గుణసనాథు' డనని చెప్పికొన్నాడు. ఈ నవీనగుణ సనాథత్వ మెట్టిదియో విమర్శింపవలయునన్నచో నాతని కాలనిర్ణయము జరుగవలయును. అతడే గుణములను దన కావ్యమునందు వ్రాసెనో వానిని తరువాతి కవులు ధారాళముగా నుపయోగించినచో కాలనిర్ణయము జరిగినగాని యా గుణములకు సంబంధించిన యతని నవీనత్వము గోచరించదు. కొన్నివిషయములలో కవియొక్క కాలము చాల ముఖ్యమగుచుండును. 'మందః కవియశఃప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్' అన్న కాళిదాసు మాటను పురస్కరించుకొని పలుమంది యాయన చాల వినయవంతుడని చెప్పుచున్నారు. కాళిదాసీ నాటి వాడైనచో నది వినయమే కావచ్చును. కాని కాళిదాసు క్రీస్తుపూర్వము మొదటి శతాబ్దమువాడు. విక్రమార్కచక్రవర్తి యాస్థానములోనివాడు నేడు ప్రచారిమునందున్న సర్వసంస్కృత కావ్యములును కాళిదాసుని తరువాత వ్రాయబడినవే. అప్పటికి సంస్కృత భాషలో నే కవులున్నారో తెలియదు. పాణిన్యాదులు కాళిదాసునకు పూర్వులు. వారును గావ్యములు వ్రాసినట్లు దెలియుచున్నది. ఆ కవి సమాజములో దానొక కవిని గాలేననియో యాతనియుద్దేశ్యము? లేదా వాల్మీకి వ్యాసు లిద్దరే కవిశబ్దవాచ్యులు రామాయణ భారతములే కావ్యములు. ఆ దృష్టిలో కాళిదాసు తాను 'కవి యశఃప్రార్థీ' యనుటలో వినయము భాసించ నక్కరలేదు. ఆ దృష్టితో గాళిదాసు నిజముగా మందుడే. నిజముగా కవియశఃప్రార్థియే. ఈ రీతిగా గొన్ని విషయములయందు కవికాలము విశేషార్థమును సంతరించి పెట్టును. ఇది తరువాతి మాట.

ఉత్తరహరివంశమునుగూర్చి దేశమునందు కొన్ని వదంతులు కలవు. ఈ గ్రంథముయొక్క యవతారిక లోపించినదని యొకటి. తొలుతటి భాగము కొంత శిథిలమైనదని మరియొకటి. తొలుతటి భాగము శిథిలమైనదన్న దానినిగురించి విశ్వసింప నక్కరలేదు. ఏలయనగా ఉన్నగ్రంథ మున్నట్లుగా నొక సంపూర్ణమైన యర్థమిచ్చుచున్నప్పుడు కొంత లోపించిన దనుకొనుట న్యాయము కాదు. అది శిల్పేతరమైన దృష్టి – ఉన్నత స్థితిగా రచన పరమ శిల్పాభిరామముగా గనిపించినప్పుడు మిక్కిలి యర్థవంతముగా గనిపించి నప్పుడు కవి యంతటి శిల్పియను మహావిషయమును పరిత్యజించి శిల్పబాహిరమైన విషయము గొంత యందులో నిమిడియుండవలయుననుట కవికి సహజముగానున్న వివేకమును వాని శిల్పమును నధఃకరించుట. రెండవది నన్నయ్య తిక్కనలవలె సోమన్న గ్రంథమునకుగూడ నవతారిక యుండి యుండవలయునని యెందు కనుకొనవలయును? అది లేకుండనే యితడు వ్రాసెనేమో. ఇతడంత స్వతంత్రుడన్న విషయము ఇతని కావ్యమునందు సర్వథా గోచరించుచున్నది.

ఉన్నదున్నట్లుగా నీ కావ్యమునందలి మహావాక్యార్థము దివ్యముగానున్నది. ఇట్టి మహావాక్యార్థముగల కావ్యములు తెలుగులో లేవనియే చెప్పవచ్చును.

భారతమున్నది. భారత మహాకావ్యము యొక్క మహావాక్యార్థము శాంతరసమునందు బర్యవసించుచున్నది. అది శాంతరస పర్యవసాయియగుట వ్యాసోపజ్ఞకమైన విషయము. నన్నయ్య చేసిన చేత వేఱు. తిక్కన్న చేసిన చేత వేఱు. ఆయన దృష్టి వేఱు. ఈయన

దృష్టివేఱు. మహాకావ్యముయొక్క సమష్టి
మీఁద సంస్కృత భారతమునందు నిర్ణీతమైన
శాంతరసము తెలుగు కావ్యమునందుగూడ
సహజముగా పర్యవసింప జేసికొనవచ్చును
గాని యెచ్చట నీ శాంతరసమునకు నడ్డు
తగులునో చెప్పలేము. ఆంధ్ర మహాభారతము
భిన్నకర్తృకమగుటచేతనైనా యిబ్బందికలదు.
ఇది చాల యగాధమైన విషయము. కొన్ని
మాహాత్మ్యములు కలవు. వానియందు మహా
వాక్యార్థ నిరూపణము సర్వకథలు తద్దేవతా
పరములగుటయే యగుచున్నది. పెద్దన్నగారి
మనుచరిత్రమునుగూర్చి ఈ మహావాక్యార్థ
సమన్వయమునుగూర్చి 'నవభారతి' యందు
వ్రాసితిని. ఇట్టి మహావాక్యార్థము నిర్ణయించు
కొని వ్రాయుటయే మహాకవియైన వాని మహా
లక్షణము. అందరును కవులే. వారి కల్పనా
శక్తిచేత, పద్యరచనా శక్తిచేత, పాత్రపోష
ణాదికములచేత, నిగూఢములైన ధ్వనుల నిమి
డించుటచేత, లోకోత్తరములైన యలంకార
ములను సంగ్రహించుటచేత, విలక్షణమయిన
యుక్తివైచిత్ర్యము కలుగుటచేత లోకము
నందు మహాకవులని యనిపించుకొనుచున్నా
రు. ఇన్ని శక్తులుకలిగి మహావాక్యార్థ నిర్ణ
యములేని కావ్యము అది కలిగిన కావ్యము
కంటె కొంచెము న్యూనమయినదని చెప్పక
తప్పదుకదా. లేనిచో గుణమునకు వెలకట్టుట
యన్నదిలేక పోవలసియుండును.

భారత భాగవత రామాయణములు
మూడును తీసి యవతల నుంచవలయును. ఆ
మహా గ్రంథములయందలి మహా వాక్యార్థ
నిర్ణయము తెలుగులో వ్రాసిన కవులకు సం
బంధము లేదు. అది వ్యాసఋషిరచిత
కావ్యములందే యున్నది. దానినీ తెలుగు
కవులెంతవరకు సంభాళించుకొని రన్నదియే
విచారణీయమయిన యంశమగుచున్నది.

ఈ మహా వాక్యార్థనిర్ణయము తక్కిన
కావ్యముల విషయమునందే పరామర్శింపదగిన
విషయమగుచున్నది. తక్కిన కావ్యములు
రెండు విధములు. ఒక విధమయిన కావ్య
సముదాయము యొక్క కథనే తీసికొని నిర్వహిం
చికొనినది. రెండవ విధమయిన కావ్యసము
దాయము పలుకథలను తీసికొని గుదిగ్రుచ్చి
కొన్నది. మొదటి విధమయిన కావ్యసము
దాయములో చేయదగినది రసచర్చ. అతఁడే
రసమును ప్రధానముగా స్వీకరించెను. ఆ
రసము నెట్లు నిర్వహించెను? అంగరసము
లేవి? వాని నెట్లు పోషించెను? ఈ చర్చయీ
కావ్యములందు ముఖ్యమైనది. రెండవవిధమైన
కావ్యసముదాయము రెండు విధములుగా
నున్నది. ఒక విధమైనది క్షేత్రమాహాత్మ్య
ములు. రెండవది కానిది. అనగా క్షేత్ర
మాహాత్మ్యములు కావు. పలుకథలుకూడిన
యొక కావ్యము. క్షేత్రమాహాత్మ్యములలో
సర్వకథలు తద్దేవతా మాహాత్మ్య ద్యోతక
ములై యదియే పరమార్థముగా భాసించును.
తక్కిన కావ్యములలో మహావాక్యార్థ నిర్ణ
యముసేత దుర్ఘటమైన విషయము. అందు
కనియే మనుచరిత్రమున నీ మహావాక్యార్థ
మెట్లు సమన్వయము పొందినదో చూపింప
బడినది.

అట్టి సమన్వయ ముత్తర హరివంశమునం
దున్నది. అట్టి సమన్వయము కలుగుటలోని
యౌచిత్యమే గ్రంథాదియందు కొంత శిథిల
మైనదని చెప్పుట యప్రసక్తమని నిరూపించుట.
ఉన్నస్థితిలో మహార్థమిచ్చుచుండగా నెవరో
చెప్పిన కొంత దీనిలోపోవుట జరిగినచో నీ
మహార్థమున కది భంజకమగును. అట్టి దాశం
కించరాదు.

ఈ దృష్టితో చూచినచో నాంధ్రసారస్వతమున నిట్టి మహావాక్యార్థ నిర్ణయము స్వాతంత్ర్యోన్మేషముతో విరచించిన వారిద్దరే. ఇటు నాచన సోమన్నయు, తరువాత పెద్దన్నయు. ఇతని యీ మహావాక్యార్థ నిర్ణయము నిరూపించుటకు పూర్వము సోమన్న తన కావ్యము హరిహరనాథున కంకితము జేయుటనుగూర్చి కొంత చెప్పవలయును. ఈ సందర్భములో నతని గద్యమును తడుమక తప్పదు. తన గద్యాదియందు 'తిక్కన సోమయాజి ప్రణీతమయిన భారత కథాసంతరంబున' అని తాను గుది గ్రుచ్చికొన్నాడు. దీనిని బట్టి యీయనకు తిక్కన్నగారి యందమితమయిన గౌరవముకలదని తెలియుచున్నది. ఆ గౌరవమే తన కావ్యమును హరిహరనాథున కంకితము చేయించినది. అందుచేత నితడు తిక్కన్నకంటె తక్కువవాడా? అన్న ప్రశ్న సముదితమగుచున్నది. ఈ ప్రశ్నకు సమాధానము చెప్పవలయుననగా మొట్టమొదట నే మహావాక్యార్థ నిర్ణయము వీని కావ్యము నందు దృశ్యమాన మగుచున్నదో తాదృశమయిన మహార్థము తిక్కన్నయొక్క భారత రచనయందు నిర్ణయింపవలసియుండును. అది సులభసాధ్య మయినదికాదు. అందుచేత స్థూలముగా నీ విషయమున నితడు తిక్కన్న కంటె నొక యాకెక్కువ చదివినవాడన వలయును. ఈ మహావాక్యార్థనిర్ణయము తరువాతి వ్యాసములో చేయబడును.

కొర్లపాటి శ్రీరామమూర్తి
లంక శివరామకృష్ణశాస్త్రి

# విలయనృత్యం

[అదొక అధ్యాపకుని ఇంట్లో వీధిగది, ఆ గదిలో ఎడంవైపు ఓ టేబిల్ మీద టేప్‌రికార్డు వుంది. కుడివైపు సోఫావుంది. మధ్య రౌండు టేబిలూ—దానిమీద పుస్తకాలూ పత్రికలూ దాని కటూఇటూ కుర్చీలూ ఉన్నాయి. వెనకగా అ, ఆ - అక్షరాలూ, 1, 2–అంకెలూ వేలాడుతున్నాయి.

తెర వేసేసరికి అక్కడెవ్వరూ వుండరు. క్రమంగా డోర్ బెల్ మ్రోగుతుంది. లోపల్నుంచి భారతం చదువుకుంటూ విశ్వనాధం వస్తాడు. అతడు పెద్దవాడు; ఆజానుబాహువు; నిండైన విగ్రహం; నిదానంకల వ్యక్తి - ]

"ప్రియము పలికెడు వారిన పెద్దమెత్తు
రప్రియంబును బథ్యంబునైన పలుకు
వినఁగ నొల్లరు గావున వేడ్కదాని
బలుక రెవ్వరు నుత్తమ ప్రతిభులయ్యు.
మొదల నప్రియ మయ్యును దుదిఁగరంబు
పథ్యమగు పల్కుప్రియులందు బలిమినైనఁ
బలుకవలయు మోమోడక యొఁసియట్టి
వాఁడు దగు సహాయుండు..."

(అనే వరకూ విశ్వనాథం చదివేసరికి మళ్ళీ డోర్ బెల్ మ్రోగుతుంది. విశ్వనాథం చదవడం ఆపి, "ఎవరది?" అంటూ వెళ్ళి వీధితలుపు తీశాడు. శారదవచ్చింది. ఇంచుమించు ఇరవై యేళ్ళుంటాయి. పైకి అమాయికంగా కనిపించినా అప్పుడప్పుడు ఆరిందాయేఅనిపిస్తుంది. ఆమె చేతిలో పుస్తకాలున్నాయి. ఆమెను లోపలికి రానిచ్చి )

విశ్వనాథం:- ఎవరికోస మమ్మా?

శారద:- మేస్టారికోసమండి. లేరాండి?

విశ్వనాథం:- ఉన్నారు. కూర్చోండి పిలుస్తాను.

శారద:- థేంక్యూ. (సోఫాలో కూర్చుంది)

విశ్వనాథం:- (లోపలికి వెళ్ళాడు)

శారద:- (పుస్తకాలు తిరగవేస్తుంటుంది.)

( అధ్యాపకుని ఆగమనం- మధ్యవయస్సు. పొట్టి, కురచగడ్డం: బ్లాక్ పాంట్, వైట్ షర్టు, రెడ్ టై వగైరా వేషం. ముందు మెత్తటి మనిషిలా కనిపిస్తాడు. కాని చివరికి ఉగ్ర స్వరూపుడవుతాడు. వస్తూనే )

అధ్యాపకుడు:- గుడ్ మార్నింగ్ యంగ్ లేడీ.

శారద:- (లేచి) నమస్కారమండీ.

అధ్యాపకుడు:- మీరు...

శారద:- శారదనండీ.

అధ్యాపకుడు:- ఓః! కొత్తగా వచ్చేరు కదూ? (కూర్చున్నాడు)

శారద:- అవునండీ. (కూర్చుంటూ) మీరు రమ్మన్న టయిమ్‌కే వచ్చేను.

అధ్యాపకుడు:- మంచిపనిచేశారు. ఆఁ. మరీ అంత తొందరలేదనుకోండి. అయినా నాకు ఆలస్యమే అయింది. ఎక్స్యూజ్ మి. వాట్స్యా?

శార:- అదే నన్న మాటండీ?

అధ్యా:- ఆఁ ఆఁ. అన్నట్టు మా ఇల్లు తెలిసికోడానికి మీకు ఆట్టే శ్రమ కలగలేదను కొంటాను.

శార:- లేదండి. ఈ చుట్టుపట్ల ఎవర్నడిగినా మీ ఇల్లుగురించి ఇట్టే తెలుస్తుంది.

అధ్యా:- అవునవును. ఈ పెద్ద పట్టణంలో

నేను ముప్పై ఏళ్ళుగా ఈ వీధిలోనే ఉంటు న్నాను. ఇది నా స్వగృహం. బహుశా మీకీ వూరు కొత్తనుకుంటాను. బావుందా ?

శార:- చాలా బావుందండీ. అటు ప్రకృతి సౌందర్యం, ఇటు పారిశ్రామిక వైభవం - కొత్తపాతల మేలు కలయికలా - సీపోర్టూ, సిందియా; కేల్టెక్స్, యూనివర్సిటీ- అబ్బ! ఎంత అందమైన పట్టణమండీ.

అధ్యా:-అందమేకాదు. అనుకూలంకూడా. ఈ పట్నమే కాదు, ఆసేతుహిమాచల పర్యంతం ఏ పట్నమైనాసరే మనచదువుకి అనుకూలవాతావరణమే.

శార:- మీకు ఢిల్లీ ఇష్టమేనాండి?

అధ్యా:- ఎందుకాక్కూడదు? నే నెప్పుడూ అక్కడికి వెళ్ళలేదనుకోండి, అయినా ఢిల్లీ మనదేశానికి - ముఖ్యపట్టణము.

శార:- ఢిల్లీ - మనదేశానికి - ముఖ్యపట్టణవండీ.

అధ్యా:- సెభాష్. కరెక్టు. దట్స్ రైట్. మీ భారతదేశ భౌగోళిక శాస్త్ర కూలంకష పాండిత్యానికి నా అభివాదాలు. ఆం. మీకు భారతదేశంలోని ముఖ్యనగరాలన్నీ తెలుసు కదండీ ?

శార:- అన్నీ తెలీవండీ.

అధ్యా:- అవునవును. తెలీవు. మరేం ఫర్వాలేదు. ఇంక తెలుస్తాయి. ఇక్కడ శ్రద్ధగా చదివితే. చదువుక్కావలసింది ముఖ్యంగా ఓపిక. అంటే పేషెన్సు. ఆం. ఇవాళ చాలా మంచి రోజు. నిప్పులు చెరిగే ఎండాలేదు. వానా రాదు.

శార:- మరిది హేమంతంకదండీ.

అధ్యా:- అవునవును. అదే నేనూ అనబోతున్నాను. కాని మీరనేశారు. అయినా ఫర్వాలేదు. ఆ పాటితెలీడ్ది నా దగ్గర చదువుకి రానేకూడదు. వచ్చేక మరి ఏవడిగినా చెప్పాలి. ఎందుకైనా సిద్ధంగా వుండాలి.

శార:- అవునండీ.

అధ్యా:-చూడండి. ఈప్రపంచంలో ఎప్పుడు ఏం జరుగుతుందో చెప్పలేం.

శార:- వర్షఋతువులో వర్షంపడుతుంది. ఆరు ఋతువుల్లోనూ వర్షఋతువు ఒకటి. తతిమా అయిదు ఋతువులూ, వ... వ... వ... వ...

అధ్యా:- సంత. సంత.

శార:- ఆం. వ_సంత, వసంత, వసంత ఋతువండి.

అధ్యా:- అవునవును. సంతను గుర్తుపెట్టుకుంటే వసంత ఋతువు జ్ఞాపకంవుంటుంది. ఇది గ్రహణధారణ పద్ధతుల్లో గమనార్హమైన ప్రాథమిక సూత్రం. ఆ ప్రాథమిక పరిజ్ఞానం మీకు సరిపూర్ణంగానేవుంది. యు ఆర్ పెర ఫెక్ట్. మీకు ఉజ్జ్వలమైన భవిష్యత్తు ఉంది. అభ్యుదయపంథాలో ఆరంభమయింది మీ గమనం. ప్రతివిద్యార్థికీ కావలసిన ప్రతిభా, వ్యుత్పత్తీ మీకు అపారంగా వున్నాయి.

శార:-అవేకావండి. శ్రద్ధా, ఆసక్తీకూడా-

అధ్యా:- అవునవును. మీ శ్రద్ధాసక్తులు నిరుపమానం.

శార:- మానాన్నగారికి నన్నో మహా విద్వాంసురాల్ని చేసెయ్యాలని విపరీతమైన పట్టుదలండి. అందుకని ప్రత్యేకమైన రిసర్చితోపాటు కొంచెం జనరల్ ఎడ్యుకేషన్‌కూడా చదవమని మా నాన్నగారు మరీమరీ చెప్పారండి.

అధ్యా:-అవునవును. అదిచాలా అవసరం. ఎంచేతంటే ప్రస్తుతం మానవజీవనవిధానం పరమ క్లిష్టంగావుంది.

శార:-అవునండి. అయినా నాకదేంఫర్వా

లేదండి. నేను చాలా అదృష్టవంతురాల్ని. మా అమ్మానాన్నా మంచి ఆస్తిపరులండి. నా చదువుకోసం ఎంత డబ్బయినా వెనుదియ్యరు.

అధ్యా:- అయితే మీరు — (లేచాడు)

శారం:- డాక్టరేట్ రిసర్చిచేద్దామని —

అధ్యా:- మీకు ఇప్పుడు ఏ డిగ్రీవుంది ?

శారం:- ఎం. లిట్ డిగ్రీ వుందండి.

అధ్యా:- అది మీకు పెద్ద అర్హతే!- ఆడవారైయుండి, ఈ వయస్సులో అంత డిగ్రీ తీసుకున్నారంటే ఎంత గొప్ప విషయం! — ఇంతకూ, మీరు ఇప్పుడు డాక్టరేట్ రిసర్చి ఏ సబ్జెక్టులో చేస్తారు? భౌతికశాస్త్రమా? భాషాశాస్త్రమా ? సాహిత్యమా? వేదాంతమా?

శారం:-మా అమ్మానాన్నా మరిఅన్నిటికీ పనికొచ్చే డాక్టరేట్ పట్టుకు రమ్మన్నారండి. మీకు వీలైతే నేను అన్ని సబ్జెక్టుల్లోనూ —

అధ్యా:— వాట్! ఇన్ ఆల్ సబ్జెక్ట్సు ? అంటే టోటల్ డాక్టరేట్? — మీ ధైర్య సాహసాలకి బ్రహ్మానందంగావుంది. అలాగే చూద్దాం. అన్నిసబ్జెక్టుల్లోనూ అంతో ఇంతో మీకు ఇప్పటికే ప్రవేశం వుంది. ఇక తప్పకుండా రిసర్చి అవలీలగా చెయ్యగలరు. అయినా లాంఛనంగా—మీకు అభ్యంతరం లేకపోతేనే— చిన్న ప్రవేశ పరీక్ష. ఎడ్మిషన్ టెస్టు.

శారం:- అలాగేనండి.

అధ్యా:- అయితే మీరు ఇలా కూర్చుంటారా ? (కుర్చీ చూపించాడు)

శారం:- (కుర్చీమీద కూర్చుంది)

అధ్యా:- మీరు నోటుబుక్కువగైరా తెచ్చారనుకుంటాను.

శారం:- తెచ్చేనండి.

అధ్యా:— మరి ప్రవేశపరీక్ష ప్రారంభించమంటారా?

శారం:- అలాగేనండి. నేను మీ ఆధీనంలోనే ఉన్నాను.

అధ్యా:- ఆఁ! ఎంతమాట! మీరు నా ఆధీనంలో ఉన్నారా? కాదు. నేనే మీ అధీనంలోఉన్నాను. విద్యార్థులకు అధ్యాపకులు విధేయులు కదా!

శారం:- ఆఁ?

అధ్యా:- మీరు అనుమతిస్తే — నే పరీక్షించిన పిమ్మట మీ పరిశోధనకు ఒక పటిష్ఠమైన ప్రణాళిక ఒరవడి పెట్టగలం. ఆఁ. బహువచనముగురించి మీకుగల విశిష్ట పరిచయమెట్టిది ?

శారం:- అంత గట్టిది కాదండీ.

అధ్యా:- పోనీలెండి... మీ కిష్టమైతే పోనీ గణిత శాస్త్రమే తీసుకుందాం.

(విశ్వనాథం వచ్చేడు)

శారం:- అలాగేనండి.

అధ్యా:- గణితశాస్త్రమన్నది- చూడండి కేవలం నూతనమైన, అధునాతనమైన శాస్త్రం. నిజానికి దాన్ని శాస్త్రమనడం కంటె కొన్ని ప్రత్యేక పద్ధతుల సమాహారమనడం సమంజసం.

విశ్వ:- ఏదీ ? ఆ అంకెల గారడీయేనా అంత మహాశాస్త్రం ?

అధ్యా:- నీ కక్కర లేకపోతే విశ్వనాథం ? ఆ మూలకిపోయి నీ కావ్యాలేవో నువ్వు చదువుకో.

విశ్వ:- అలాగే చదువుకుంటాగాని, ఆ అంకెలగారడీమట్టుకు మళ్ళీ ఆరంభించకు.

అధ్యా:- అదిగో, ఆ గారడీ అన్నమాట ఉపసంహరించుకు మరీ ఆ మూలకిపోయి చదువుకో.

విశ్వ:- ఎప్పుడూ అదేపాట. మూల మూలని ఒకటే గోల.ముచ్చటకైనా ఒక్కసారి

ఆ కావ్యాలు చూచి ఆనందించలేవు. హుం. "అరసికాయ కవిత్వ నివేదనం శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ."

అధ్యా:-చాలు నీ సుభాషితాలు. ఇక్కడ నీ ఉపదేశాలు ఎవ్వరికీ అక్కర్లేదు. అదీగాక నా ఆనందం నాకు తెలుసు. మధ్య నీ బోడి సలహా లేమిటి?

విశ్వ:- అవునులేరా. అయినా ఓమాట. పాపం ఈ అమ్మాయి ప్రాణం తీయకు నీ గారడీలతో.

(అని లోపలికి వెళుతుండగా)

అధ్యా:- అది నీ కనవసరం. ఇది కేవలం నా స్వవిషయం. ఇందులో నీ ప్రమేయం ఉండకూడదు. లోపలికి వెళ్ళు.

విశ్వ:- వెళుతున్నా. ఏదో పెద్దవాణ్ణి. ఉండబట్టలేక, అనవలసినముక్క అనవసరమైనా అన్నాను. కావలసినవాణ్ణి కనక. ఆతర్వాత నీ ఇష్టం.

(అని లోపలికి వెళ్ళిపోయాడు)

అధ్యా:- చూశారండీ. అడుగులోనే హంసపాదని అతిగాని మాటలకేం లెండి. ఏదో పెద్దవాడు, కావలసిన బంధువు అని చోటిచ్చినందుకు ఇలా స్వారీ చేస్తుంటాడు నామీద. ఈ నిరంతర విద్యా పరిశ్రమవల్ల నా ఆరోగ్యం ఎక్కడ చెడిపోతుందో అని మా విశ్వనాథం భయం.

శార:- పాపం. ఆయనెంత మంచివారో!

అధ్యా:- అవునవును. దానికేంగాని మనం గణితంలోకి వద్దాం.

శార:- అలాగేనండీ.

అధ్యా:- లెక్కలు చేయడం మీకష్టం కాకపోతేనే!

శార:- అబ్బే. కష్టమేం వుందండీ?

అధ్యా:-అయితే ఒన్ ప్లస్ ఒన్ ఎంతండీ?

శార:- ఒన్ ప్లస్ ఒన్ - ఈజ్ ఈక్వల్టు - టు -

అధ్యా:- ఓ; వెరీగుడ్. ఎక్సలెంట్. మీకు గణితశాస్త్రం కరతలా మలకమే. ఎన్ని సబ్జెక్ట్సు అయినా మీరు ఇట్టే సాధించగలరు. తప్పకండా మీకు టోటల్ డాక్టరేట్ వచ్చి తీరుతుంది.

శార:- మీరు అనుగ్రహించాలేగాని అ దెంతసేపండీ!

అధ్యా:- అవునవును. టు ప్లస్ ఒన్ కూడా ఎంతో చెప్పండి.

శార:- త్రీ.

అధ్యా:- త్రీ ప్లస్ ఒన్?

శార:- ఫోర్.

అధ్యా:- మరి ఫోర్ ప్లస్ ఒన్?

శార:- ఫైవ్.

అధ్యా:- ఫైవ్ ప్లస్ ఒన్?

శార:- సిక్సు.

అధ్యా:- సిక్సు ప్లస్ ఒన్?

శార:- సెవెన్.

అధ్యా:- సెవెన్ ప్లస్ ఒన్?

శార:- ఎయిట్.

అధ్యా:- సెవెన్ ప్లస్ ఒన్?

శార:- ఎయిట్.

అధ్యా:- సెవెన్ ప్లస్ ఒన్?

శార:- ఎయిట్. ఒకోసారి నైన్ కూడానండీ.

అధ్యా:- యస్. వండర్ ఫుల్. మార్వలెస్. ఇంక మీకు కూడికలతో పని లేదు. మరి తీసివేతలుకూడా - ఫోర్ మైనస్ త్రీ?

శార:- ఫోర్ మైనస్ త్రీ! ఫోర్ మైనస్ త్రీ!!

అధ్యా:- అంటే నాలుగులోంచి మూడు తీసివేయగా శేషమెంతండీ?

శార:- ఏడు.

అధ్యా;- సారీ—మీ ప్రతిపాదనకు నేను ప్రత్యాఖ్యానం చేయవలసి వచ్చినందుకు క్షమించండి. మీరు ప్రశ్న సరిగా వినిపించుకున్నారు కాదనుకుంటాను. నాలుగులోంచి మూడు తీసివేస్తే ఏడురాదు. కూడితేవస్తుంది. ఫోర్ ప్లస్ త్రీ ఈజ్ ఈక్వల్‌టు సెవెన్. ఫోర్ మైనస్ త్రీ ఈజ్ ఈక్వల్‌టు సెవెన్ కాదు. తీసివేత అనగా కూడిక కాదు. తీసివేత అనగా – తీసివేత అనగా – తీసివేయడమే. ఒక దాంట్లోంచి ఒకటి తీసి, వేయడమే.

శార;- తీసి — వేయడమే నాండి ?

అధ్యా;- నాలుగులోంచి మూడు తీసివేయగా – చూడండీ – కలపగా కాదు – తీసివేయగా – ఎంతండీ ?

శార;- నాలుగూ.

అధ్యా;- నో నో నో.

శార;- అయితే మూడండీ.

అధ్యా;- అబ్బబ్బె. మళ్ళీ ఆలోచించండి.

శార;- పోనీ అయిదూ.

అధ్యా;- అబ్బబ్బ. కాదండి. మీరు ఊహిస్తున్నారు. మేథమేటిక్సు కవిత్వంకాదు. సైన్సు చూడండి. ఇప్పుడు మీ చేతే సరియైన సమాధానం చెప్పిస్తాను. ఆఁ. మీరు అంకెలు లెక్క పెట్టగలరు కదూ ?

శార;- ఓః. (వేళ్ళమీద లెక్కపెడుతుంది) ఒకటీ రెండూ మూడూ నాలుగూ అయిదూ.

అధ్యా;- ఆఁ ఆఁ...మీకు ఎలా లెక్కపెట్టాలో బాగా తెలుసు. అలా ఎన్ని అంకెలు లెక్కపెట్టగలరు ?

శార;- ఇన్ఫినిటీవరకూ ఎన్నైనాసరే లెక్కపెట్టగలనండి.

అధ్యా;- అదెలాసాధ్యం అమ్మా !

శార;- అయితేనండి పదహారువరకూ లెక్కపెడతానండి.

అధ్యా;- అదీ. పదహారువరకూ చాలు. ఎవరిమట్టుకు వారు తమతమ హద్దులు తెలిసికోవడం మంచిది. అదిసరే. ప్లీజ్. అంకెలు లెక్కపెట్టండి.

శార;-వన్ టు ఒకటి రెండూ త్రీ మూడు ఫోర్ నాలుగు.

అధ్యా;- ఆగండి. ఇప్పుడు మూడూ నాలుగూ – ఈ రెండూ రెండు సంఖ్యలు. ఇందులో ఏది పెద్దసంఖ్య? మూడా? నాల్గా?

శార;- పెద్ద సంఖ్యంటే ఏమిటండీ ?

అధ్యా;- అసలు సంఖ్యలు రెండు రకాలు పెద్దసంఖ్యలు, చిన్నసంఖ్యలు. ఈ చిన్నసంఖ్యలు ఒకోసారి – వాటి తిసాదియ్య – పెద్ద సంఖ్యలకంటె పెద్దవవుతుంటాయి. మనమిప్పుడా వివరాల్లోకి వెళితే మరీ అగాధమవుతుంది ఇలా చూడండి. (గీవేసు)

(అక్కడో నల్లబల్లఉన్నట్టు దానిమీద వ్రాస్తూ)

ఇక్కడ మూడు అగ్గిపుల్లలున్నాయి. ఒకటి రెండు, మూడు. ఇవిగాక ఇది మరొకటి. ఈ మొత్తం నాలుగు. ఇవిగో సరిగా చూడండి. మనదగ్గర నాల్గు అగ్గిపుల్లలున్నయి. ఇందులో ఒకటి తీసేశాం ఇంకెన్ని వుంటాయోచెప్పండి.

శార;-అయినండీ. మూడూ ఒకటీ నాలుగయితే, మరి నాలుగూ ఒకటీ అయిదే కదండీ ?

అధ్యా;- అమ్మమ్మ ! – అది కాదమ్మా తల్లీ ! మీ దృష్టిలో ఎప్పుడూ కూడికలే. తీసివేతలుకూడా చేసివ్వాలి మరి. చూడండి. ప్రపంచంలో సమీకరణమేకాదు, పృథక్కరణంకూడా అవసరం. అసలు జీవితంలోని అంతస్తత్వమే అది. అదే వేదాంతం. అంటే ఫిలాసఫీ. అదే సైన్సు. అంటే విజ్ఞానశాస్త్రం. అదే నాగరకతా అభ్యుదయమూ.

శార;- అవునండి.

అధ్యా;- అది సరే. అగ్గిపుల్లలకేసివద్దాం. ఇవిగో నా ఘు అగ్గిపుల్లలు. సరిగాచూడండి. ఒకటి రెండు మూడు నాలుగూ...ఈనాలుగు లోంచి ఇప్పుడు ఒకటి తీసేశాను. ఇంక మిగిలేవి——

శార:- నేను చెప్పలేనండి మేస్టారూ!

అధ్యా;- అవునవును. చెప్పడం కష్టమే అనుకోండి. అయినా మీరే చెప్పగలరు. అదీ గాక అందుకు్కావలసిన మేధాశక్తి మీ కెలానూవుంది. కనుక——

శార;- ఏమోనండి. ఆ తీసి — వేసే పం నా చేతకావటండి.

అధ్యా;- పోనీ. మరోచిన్న ఉదాహరణ. మీ చేతిలో రెండు పెన్నులున్నా యను కోండి. అందులో ఒకటి నేను తీసుకున్నాను. ఇహ మీదగ్గర ఎన్నివుంటాయి ?

శార;- అస లుండవండి.

అధ్యా;- అదేమిటమ్మా! అసలుండవా ?

శార;- ఉండవండి. అసలు మీరు నా చేతి లోంచి పెన్ను తీసుకున్న దేదీ ? ఒకవేళ తీసు కున్నా నా దగ్గరున్న పెన్ను ఒకటే కాబట్టి అదికాస్తా లేకండా పోతుంది. అంటే మరి అసలుండ నట్టేగా ?

అధ్యా;- అది కాదమ్మా. నా ఉదాహ రణ మీ రర్థం చేసికోడం లేదు. సరే. మీ దగ్గర ఒకటే పెన్నుంది. నేను మరోపెన్ను ఇచ్చా ననుకోండి. అప్పుడు మీ దగ్గిరెన్ని పెన్ను లుంటాయో చెప్పండి.

శార;- రెండు పెన్ను లుంటాయండి.

అధ్యా;- అదీ. అలాచెప్పాలి సమాధా నం. ఇంకో పెన్ను ఇస్తే ?

శార;- మూడండి.

అధ్యా;- అందులో ఒకటిమళ్ళీ నే తీసేసు కుంటే ?

శార;- రెండు.

అధ్యా;- గుడ్. మళ్ళీ నేను మరొకటి తీసుకుంటే ?

శార;- రెండేనండి.

అధ్యా;- అబ్బెబ్బె. మీ దగ్గర రెండు పెన్నులుండగా నేను ఒక పెన్ను తీసుకుంటే ఇక మిగిలేవి——

శార;- రెండు కదండీ.

అధ్యా:- కా దొకటమ్మా.

శార:- అబ్బే. రెండేనండీ.

అధ్యా;- ఒకటండి.

శార;- ఊహుం. రెండు.

అధ్యా;- ఒకటి.

శార;- రెండు.

అధ్యా;- ఒకటి.

శార;- రెండు.

అధ్యా;- ఒకటి.

శార;- రెండు.

అధ్యా;- అబ్బబ్బ. ఈ ఉదాహరణ మీకు సరిపడిందికాదు. సరే. ఇంకోపద్ధతి. (మళ్ళీ నల్లబల్ల ఉన్నట్టు (వ్రాయబోతూ) ఇలాచూడండి. చూస్తున్నారుకదూ ?

శార;- చూస్తున్నానండి.

అధ్యా;- ఇవి పిన్నులు. ఇదొకపిన్ను. ఇవి రెండు, మూడు, నాలుగు, అయిదు — ఒక పిన్ను రెండు పిన్నులు, మూడు పిన్నులు నాలుగు పిన్నులు అయిదు పిన్నులు — ఈ ఒకటీ రెండూ మూడూ అంకెలు. పిన్నులు యూనిట్సు. ఒకోపిన్ను ఒక్కొక్క యూనిట్టు. ఆఁ. ఏమన్నాను ?

శార;-ఒకో పిన్ను ఒక్కొక్క యూనిట్టు. ఆఁ ఏమన్నాను ?

అధ్యా;- యూనిట్ ఆర్ ఫిగర్. ఆర్

నెంబర్. ఒకటి రెండు మూడు నాలుగు ఇవి సంఖ్యాశాస్త్రానికి సంబంధించిన విషయాలు.

శార:- అవునండి.

అధ్యా:- ఒక్క మాటలో గణితశాస్త్రం యావత్తూ ఇందులో ఇమిడివుంది.

శార:- సరేగానండి. మూడు యూనిట్లలోంచి రెండు యూనిట్లు తీసివేసినట్లే మూడు మూళ్ళనుంచి రెండు రెళ్లు తీసేయగలమాండి?

అధ్యా:- ఇదిగో చూడమ్మా. ఇలా విను. మధ్యలో మాటాడకూడదు. సంఖ్యాశాస్త్ర ప్రాథమిక విషయాలు తెలీకపోతే లక్షలాది సంఖ్యలమీద గుణకారా లెలా చేయగలం? చూడండి. తొంభై తొమ్మిదికోట్ల డెబ్భై తొమ్మిది లక్షల ఎనభై ఆరువేల తొమ్మిది వందల అరవై రెండుని, నలభై ఆరుకోట్ల ఎనభై రెండు లక్షల ముప్పై మూడువేల మూడువందల నలభై నాలుగుతో గుణిస్తే ఎంత వస్తుందో ఎలా చెప్పగలరు?

శార:- ఇట్టే చెప్పెయగలనండి. నలభై ఆరువేల ఏడు వందల ఇరవై తొమ్మిది కోటి కోట్ల, ఏడులక్షల ఏడు వందల ముప్పై అయిదు కోట్ల, ఏభైఆరు లక్షల అరవై ఒక్కవేల ఇరవై ఎనిమిది.

అధ్యా:- కాదు. నలభై ఆరువేల ఏడు వందల ఇరవైతొమ్మిది కోటికోట్ల, ఏడులక్షల ఏడువందల ముప్పై అయిదు కోట్ల, ఏభైఆరు లక్షల అరవై ఒక్కవేల ఇరవై తొమ్మిది.

శార:- తొమ్మిది కాదండి. ఎనిమిదే.

అధ్యా:- (గుణించడం అభినయించి) యస్. యు ఆర్ రైట్. అవునుగాని సంఖ్యాశాస్త్ర ప్రాథమిక విషయాలపర్యాలోచన లేకుండా మీరెలా చెప్పగలిగారు?

శార:- ఆ పర్యాలోచన లేదుగనుకనే చెప్పగలిగానండి. అదీగాక కోట్లమీద గుణకారాలన్నీ నాకు బట్టీయేనండి.

అధ్యా:- అవునవును. అలాగేవుండాలి. అయినా మీరు మరోలా అనుకోకపోతే ఒక మాట. మీ బట్టీసమాధానం నాకు అంత సంతృప్తి కలిగించలేదు. ఎంచేతనంటే గణితశాస్త్రంలో గణనీయమైనది అవగాహన. అది పర్యాలోచనవల్లనే సాధ్యం. అంతే కాదు. అసలు బట్టీపట్టడంవుంది చూశారూ, అదిగణిశాస్త్రానికి పరమశత్రువు.

శార:- అలాగాండి?

అధ్యా:- సరే. అదలావుంచండి. మరో విషయం చూద్దాం.

(విశ్వనాథం వచ్చాడు)

విశ్వ:- అబ్బాయ్!

అధ్యా:- చూడమ్మా. మీకు స్పెషల్ మేథమేటిక్సులో అంత పరిచయం లేకపోవడం కొంత శోచనీయమే!

విశ్వ:- అబ్బాయ్ సన్నే.

అధ్యా:- కనుక, మీకు టోటల్ డాక్టరేట్ ప్రవేశ పరీక్షలో నెగ్గుకురావడం కొంత —

శార:- బహుశా కష్టమే ఏమోనండి.

అధ్యా:- ఆఁ. పెద్దకష్టంకాదుకాని — చిటికీ మాటికీ నీ గోలేమిటి విశ్వనాథం? — లోపలికి వెళ్ళి నీ పనిచూసుకో. ఊఁ. వెళ్లు. — ఆఁ చూడండి. కనీసం పార్షల్ డాక్టరేట్ కయినా మిమ్మల్ని తర్ఫీదుచేసే పూచీనాది ఆఁ. మీకు పార్షల్ డాక్టరేట్ కే ఇష్టపడితే మనం వెంటనే కంపేరిటివ్ ఫిలాలజీ అండ్ ఎలిమెంట్స్ ఆఫ్ లింగ్విస్టిక్స్ మొదలుపెడదాం.

విశ్వ:- ఆ ట్రిక్కేవద్దని అనేకసార్లు చెప్పాన్నీకు.

అధ్యా:- ఇదిగో నువ్వు హద్దుమీరుతున్నావ్!

విశ్వ:— లేదు. నీ శ్రేయస్సు కోరి చెబుతున్నాను. ఆ ఫిలాలజీ అసలేవొద్దు. అది ప్రాణాంతకం.

శార:— (ఆశ్చర్యంగా) ప్రాణాంతకమా? (నవ్వేస్తూ) బలేమాటన్నారండీ!

అధ్యా:— ఇదిగో విశ్వనాథం. లోపలికి వెళ్ళు.

విశ్వ:— వెళతా (కదలి) నా కెందుగ్గాని పెద్దముండావాణ్ణి చెబుతున్నా ఆ ఫిలాలజీ ప్రాణాంతకం (వెళ్ళాడు).

అధ్యా:— ఆఁ. చూడండి. ఆయన మాటలకేం. ఇంక ఫిలాలజీ ప్రారంభిస్తాం.

శార:— అలాగేనండి.

అధ్యా:— ఒక్క పదినిమిషాల్లో మొత్తం భారతదేశభాషల కంపేరిటివ్ ఫిలాలజీ, లింగ్విస్టిక్సులోని ప్రాథమిక సూత్రాలన్నీ అరటిపండు వొలిచి అరచేతిలో పెట్టినట్టు అవలీలగా అవగాహన చేయిస్తాను — సావధానంగా వినండి.

శార:— ఓఁ. వింటానండి. (అని పెద్దగా చప్పట్లు కొడుతుంది.)

అధ్యా:—అదేవిటి? ఆ చిలిపిచేష్టలు ఇక్కడ మానెయ్యాలి. అందులోనూ ఇది ఫిలాలజీ పాఠం. సీరియస్‌గావినాలి. సీరియల్‌గా నే తయారుచేసిన ఉపన్యాసాలు ఎప్పటికప్పుడు నీట్‌గా టేప్ రికార్డుచేయించి బహుభద్రంగావుంచాను. (అంటూ టేప్ రికార్డర్‌ని సమీపించి) ఇదిగో. మచ్చుకి మొదటిది (అని స్విచ్ వేశాడు)

( టేప్ రికార్డర్‌లోంచి )

ద్రావిడ భాషలంటే దక్షిణదేశ భాషలు. "ద్రావిడ" అనేది సంస్కృతశబ్దమే. అయినా ద్రావిడభాషమాత్రం సంస్కృతభాషకాదు. తెనుగు, అరవం, కన్నడం, మలయాళం. తుళు, కొడగు, తుద, కోట, గోండు, ఖోండు, కూయి, కోలామి, నాయకి, పర్జీ, ఒల్లారి, గదబా, వగైరా ద్రావిడభాషలు. మద్రాసురాష్ట్రంలోమాటాడేది అరవం లేక తమిళం. మైసూరు ప్రాంతంలో మాటాడేది కన్నడం. అంటే కర్ణాటకం. కేరళ ప్రదేశంలో భాష మలయాళం. ఆంధ్ర ప్రదేశ్ భాష తెనుగు అంటే ఆంధ్రం. ఈ విధంగా ప్రదేశాన్నిబట్టి భాషమారుతుంది. అందుకు హేతువు భౌగోళిక పరిస్థితులు. కనుక భాషాశాస్త్రం భౌగోళికశాస్త్రం కవలపిల్లలు. ఇంతకీ ద్రావిడభాషలు ఒకకుటుంబానికిచెందినవి. ఉదాహరణ అరవంలోని అవన్నే తెలుగులోని వాడు. తెలుగులోపిల్ల మలయాళంలో పిళ్ళ. కన్నడంలో పిళ్ళె. అరవంలో పిళ్ళై.

( స్విచ్ ఆపుచేశాడు )

ఎలా వుందమ్మా. ఆఁ. భాష కొన్ని శబ్దాలు — లేక—

శార:—శబ్దాలు లేక ఫొనీమ్సండీ ఫొనీమ్సు.

అధ్యా:— ఆఁ ఆఁ. అదే నేనూ అనబోతున్నాను. మాటమధ్యలో మీ సద్దుతగలకూడదు. జాగ్రత్తగా వినండి.

శార:— అలాగేనండి.

అధ్యా:— అసలు భాషఅంటే ఏవిటి? మనం మాటాడేది. మాటంటే శబ్దం. శబ్దంలో ధ్వనులుంటాయి. ఆ ధ్వనులు మనం నోట్లోంచి వదిలే గాలివల్ల పుడతాయి. నోరు మూసుకుని గాలి వదిలితే అది గాండ్రింపు అవుతుంది. ఎలాగంటే (గాండ్రిస్తాడు) అది శబ్దం అవ్వదు. కనుక నోరుతెరిచి గాలి వదిలేటప్పుడు మెడ సాధ్యమైనంత పైకెత్తి, బుగ్గలు పూరించి, కాలి బొటనవ్రేళ్ళమీద నిలబడి క్రమంగా — (అలా లేచాడు)

శార:— నేస్తాయా! (లేవబోయింది)

అధ్యా:—ఆగండి. మధ్యలో అరవకూడదు.

కూర్చని వినండి. ఆఁ. (మళ్ళీ లేస్తూ) కాలి బొటనవ్రేళ్లమీద నిలబడి క్రమంగా నాదతంత్రులద్వారా - అంటే త్రూ వోకల్ కార్డ్స్ - ఊపిరితిత్తులు ఉగ్గబెట్టి శబ్దాన్ని ఉచ్చరించాలి. ఎలాగంటే - ఊఁ. సీతాకోక చిలుక- విష్వక్సేనుడు- ట్రెఫాల్గర్ స్క్వేర్ - ఈవిధంగా శబ్దాలు శ్వాసవాయువుల్లో నిండి వుంటాయి. అందువల్ల అవి ఒక స్వరూపాన్ని పొంది ... పొంది ... పొంది ...

శార:- స్పష్టంగా వినపడతాయండి.

అధ్యా:- అవునవును. కాని మధ్యలో అంది వ్వకండి. ఆవిధంగా ఉత్పన్నమయ్యే ధ్వనుల కూడికవల్ల పదాలు, పదబంధాలు, వాక్యాలు ఏర్పడతాయ్.

శార:- (బాధగా) అమ్మో!

అధ్యా:- అదేవిఁటండీ ?

శార:- అబ్బా! తల నొప్పొస్తోందండీ.

అధ్యా:-చ్. తల నొప్పేకదా. ఆపాటి దానికి చదువు ఆపకూడదు. చూడండి. ఆ ధ్వని విశేషాలే అచ్చులూ హల్లులూను. అకారాదులు అచ్చులు, కకారాదులు హల్లులు. హల్లుల్లో కచటతపలు గజడదబలు గానూ గసడదవలుగానూ మారుతుంటాయి. ఉదాహరణకి చూడండి. కడప-గడప; కాడులు-కూరగాడులు; తండ్రి - తలి దండ్రులు; చుక్క - వేగుఁజుక్క.

శార:- తలనొప్పి ఎక్కువయేలా వుందండీ.

అధ్యా:- మరేం ఫర్వాలేదు. మాటాడక వినండి. ఈ కచటతపలు గజడదబలుగాను, గసడదవలుగాను మారడం ద్రావిడ భాషలన్నిటిలో పరస్పరంకనిపిస్తుంది. ఉదాహరణకి తెనుగులో గూని, అరవంలో కూన్, కన్నడంలో కూను, మలయాళంలో కూన్, ఇటువంటి సమాన లక్షణాలనుబట్టి ఈ ద్రావిడ భాషలు ప్రత్యేకం ఓ కుటుంబమనీ, వీనికీ సంస్కృతానికీ జన్యజనకభావం లేదనీ సిద్ధాంత మవుతోంది.

శార:- అబ్బ. తలనొప్పి ఎక్కువవుతోందండీ.

అధ్యా:- ఆ సిద్ధాంతం అంత ముఖ్యం కాదు. అసలు భాషాశాస్త్రం అనగా - అంటే లింగ్విస్టిక్సు అనగా ముఖ్యమైనవి ఇందాక చెప్పిన ఫొనీమ్సూ ఇప్పుడు చెప్పబోయే ఫొనిటిక్సూను. అసలు ఒకభాషను మరొక భాషనుంచి వేరుపరిచేది, దాని విలక్షణమైన ఉచ్చారణ విధానం. సరిగా ఉచ్చరించకపోతే భాషయొక్క ప్రయోజనమే ఉండదు. ఆఁ. ఈ సందర్భంలో జ్ఞాపకం వస్తోంది. అప్పుడు నేను చాలా చిన్నవాణ్ణి. అంటే మరీ చిన్న కాను. మిలిటరీలో ఓ ఆఫీసరుగా వుండేవాణ్ణి. అక్కడ మాతో మిత్రుడు ఉండేవాడు. అతని ఉచ్చారణ తమాషాగా ఉండేది. ఫ (Fa) ఫ (Pha) గాను, ఫ (Pha) ఫ (Fa) గాను పలికిందుకుఁదేవి. అంటే కాఫీ (F) అనడానికి కాఫీ (Ph) అనీ, కఫము (Ph) అనడానికి కఫము (F) అనీ, ఫసలీ (F) అనడానికి ఫసలీ (Ph) అనీ ఉచ్చరించేవాడు. మాకు నవ్వాగేదికాదు. (అని వికారంగా నవ్వి) కనుక ఉచ్చారణ కట్టుదిట్టంగా వుండాలి. అందుకోసం ఉచ్చారణగురించి గొప్ప కృషిచేయాల్సివుంది. రకరకాల మనుష్యుల రకరకాల ఉచ్చారణల్ని రికార్డు చేసి పరిశోధించవలసిన అవసరం ఎంతైనావుంది.

శార:- అబ్బా. నాకు తలనొప్పి ఎక్కువైపోయిందండీ.

అధ్యా:- సరేగాని చూడండి. ఆ ఉచ్చారణలు ఆయా ప్రాంతాల్నిబట్టి అనేకవిధా

లుగా ఉంటాయి. అయినా భాష ఒకటే. మన తెనుగే. (అంటూ టేప్‌రికార్డు వేశాడు. అందులోంచి)

మన వ్యావహారిక ఆంధ్రభాష:—

"ఒక మనుష్యునికి యిద్దరు కుమారులు వుండిరి."

చాందా జిల్లాలోని కోంటావు భాష:—

"ఒక మనిసికి ఇద్దరు పిలగాండ్లు వుండిరి."

బొంబాయి ప్రాంతంలోని కామాటీభాష:—

"వక్క మనిసికి ఇద్దరు కొడుకులు ఉండుండ్రి."

బెలగాము జిల్లాలోని దాసరీభాష:—

"ఒక్కోడొక్కోడ్ మనిసికి ఇద్దరు మగపిలగాళ్లు ఉండ్లి."

బెల్గాము జిల్లాలోని బేరాడీ భాష:—

"ఒకని కొకనికి గిరెస్తనక్ ఉద్రుపటి బిడ్లీ ఉండ్రి."

(టేప్ రికార్డర్ ఆపుచేశాడు. విశ్వనాథం వచ్చాడు)

అధ్యా:- ఇవి మాండలిక భాషల్లోని ఉచ్చారణ భేదాలు. చూశారా ఒకే వాక్యం ఉచ్చారణలో ఎన్ని రకాలుగా వుందో, వింటుంటే ఎంత వినోదం? ఎంత ఆశ్చర్యం? భాషాశాస్త్ర మంటేనే బ్రహ్మానందం.

విశ్వ:- బ్రహ్మానంద సబ్రహ్మచారి అన్నారు కావ్యాల్లోని రసాన్ని పూర్వులు. ఇప్పుడు ఆ బ్రహ్మానందం పోయి ఈ బ్రహ్మానందం వచ్చింది. ఇంతకీ హేతువు ఈనాడు జాతిలో రసజ్ఞత చావడమే. అందుకే ఎప్పుడో అన్నాడు ఓ మహానుభావుడు. "దేశములో నుపజ్ఞ చంపుటకు పరిశోధనలని సంద్రుకలు లెక్కపెట్టుట యొకడు ప్రారంభమైనది" అని.

అధ్యా:- ఆఁ. ఆయన కేం తెలుసు? అసలు సామాన్యుల కేం తెలుసు సైంటిఫిక్ రిసర్చి విలువ. కాక, ఆ అన్నవాడు ఒక కవి అయి వుండాలి. కవీ కవిత్వం వట్టిచెత్త. ఈ మోడరన్ ఏజ్‌లో ఇంత భారీఎత్తున సర్వత్రా సైన్సూ టెక్నాలజీ డెవలప్ అవుతుంటే కవిగాడి రోదన వినేదెవడు? అసలా కవిత్వాక్కూడా ఆధారం భాష. ఆ భాషని భాషాశాస్త్రవేత్తలు సైంటిఫిక్‌గా ఎనలైజ్‌చేసి భాషాతత్త్వాన్ని ఇదమిత్థంగా నిర్ణయిస్తే తప్ప సాహిత్యమనేది పుట్టనేపుట్టదు. పుట్టినా పెరగదు.

విశ్వ:- ఓహో. ఏమిఁ సిద్ధాంతంరా. మొత్తానికి సామెత చెప్పినట్టేవుంది. వెనకటికి నీలాటివాడే ఓ ప్రబుద్ధుడు అన్నాడట పెళ్ళాంతో. నే పుట్టకపోతే నీకు మొగుడెవడే అని. మీ భాషాశాస్త్రమేఁ లేకపోతే సాహిత్యం ఉండదన్నమాట.

శార:- (ఆసక్తిగా) సాహిత్యమాండి?

అధ్యా:-ఆఁ. సారహీనమైనది సాహిత్యం. అటువంటి సాహిత్యం మీవంటి మేధావినులు చదువదగ్గదికాదు. మీకు తగింది భాషాశాస్త్రమేఁ.

విశ్వ:- అవునమ్మా. అదిచదివితేనే ముక్తీ మోక్షమూను. అసలు చదువెందుకు? కమ్మనివంటకాల్ని కాదని వంటచెరుకు పుట్టుపూర్వోత్తరాలతోనే పొట్టనింపుకునే కాలమిది. చెట్టుచెడేకాలానికి కుక్కమూతి పిందెలట! ఎంతచెప్పినా వినంది ఎవడేంచేస్తాడు?

(లోపలికి వెళ్ళిపోయేడు)

అధ్యా:- ఈ ముసలాడిగోల శ్రుతిమించుతోంది. ఎంతచెడ్డా బంధువని ఆశ్రయమిచ్చినందుకిదీఫలితం. ఈ రభసకేంగాని భాషాశాస్త్రంలో బాగా చదవాల్సింది ఫొనెటిక్సు. అంటే మరేంలేదు. ధ్వనిశాస్త్రం. అది కేవలం ఉచ్చారణకి సంబంధించింది.

శార:- మళ్ళీ తలనొప్పి వస్తోందండీ.

అధ్యా:- ఇదిగో అటువంటి స్వల్పవిషయం కోసం ఇటువంటి ముఖ్యమైన పాఠాన్ని ఆపు చేయడం సిగ్గుచేటు. అనుచితంగా ప్రవర్తించక చెబుతున్నది శ్రద్ధగావినండి. ఆఁ. ఏం చెబుతున్నాను. ఓః. ధ్వనిశాస్త్రం. ధ్వనిశాస్త్రం ఎంత గొప్పదంటే తత్ఫలితంగా తయారైన ఉచ్చారణలిపివల్ల ఈ నాడు అమెరికా మొదలైన ఇతరదేశాల్లోని భాషాశాస్త్ర వేత్తలు సైతం తెనుగులో అద్భుతమైన పరిశోధనలు చేస్తున్నారు. అది కొందరు అర్థంచేసికోలేక 'ఆఁ. అమెరికావాళ్ళు తెనుగులో రిసర్చిచేయడమేమిటీ వాళ్ళ మొహం.' అనుకుంటారు. అది కేవలం అజ్ఞానం. అసలు ఒక భాష గురించి పరిశోధన చేయాలంటే ఆ భాషరాకపోవడవే గొప్పసౌకర్యం. కనుక ఫొనిటిక్ స్క్రిప్టు చాలా అవసరం.

శార:- అబ్బా! తలనొప్పి. అమ్మో. అమ్మో.

అధ్యా:- ఇదిగో చీటికి మాటికి ఇలా తలనొప్పని తందనాలాడితే లాభంలేదు. ఇలా వినండి. తాటాకు అని ఓపవం. తాటాకు అనేటప్పుడు 'ట'అనం. అంటే చిగురుటాకుఅన్నట్టు తాటాకుఅనం. కనుక తాటాకులోఅకారానికి ఎకారానికి మధ్యస్థమైన ఒక ప్రత్యేకమైన ఉచ్చారణకలదని కళ్ళకట్టినట్టు కనుపిస్తోంది. ఇలాగేవ్యావహారికభాషలో వచ్చేడు చచ్చేడు అంటాం. ఇక్కడకూడా 'అ' కి 'ఎ' కి మధ్య ఉచ్చారణవుంది. దానికి ప్రత్యేకమైన సంకేతం లేనందున 'చే' అనో 'చా' అనో వ్రాయాలి. అలావ్రాస్తే వచ్చేడు చచ్చేడు అనో వచ్చాడు చచ్చాడు అనో చదవాల్సివస్తుంది. కనుక ఉచ్చారణకి అనుగుణమైన లిపి అవసరం. అదిలేద్ది సాహిత్యం పుట్టదు.

శార:- ఇంక విన లేనండి. ఇందాకటికంటె ఎక్కువైపోయింది. తలపగిలిపోతున్నదండీ. (లేచింది)

అధ్యా:- మరేం ఫర్వాలేదు. తలపగలదు. ఫొనిటిక్సువల్ల తలగట్టిపడి బుద్ధివికసిస్తుంది. టోటల్ డాక్టరేట్ వస్తుంది. మీకే. నాక్కాదు. నేను టోటల్ డాక్టరేట్ కాదు.సూపర్ టోటల్ డాక్టరేట్. మీ కంటె చిన్నవయస్సులో ఎప్పుడో సంపాయించాను. ఇప్పుడు మీకు టోటల్ డాక్టరేట్ రావాలని నాకీ కంఠశోష.

శార:-కాన్నాకు తలనొప్పితగ్గడంలేదండీ.

అధ్యా:- అస్తమానం అదేగోల. మంచీ చెడ్డా వుండద్దూ. ప్రతిమాటకీ ఇలా పానకంలో పుడకలా అడ్డుపడితే పాఠాలెలాసాగుతాయ్?

శార:- అవునండి. ఇక అలాగేవింటాను. చెప్పండి. (కూర్చుంది)

అధ్యా:- వట్టి చెప్పడంకాదు. మీకు ప్రత్యక్షంగా ప్రతీదీ వివరించాలి. చూడండి. ఒక్కఆంధ్రదేశంలో ఒక్కొక్కఆంధ్రపదానికి ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్కరకమైన ఉచ్చారణవుంది. ఆఉచ్చారణలన్నీ గమనించి సమగ్రమూ స్వయంసంపూర్ణమూ అయిన ఉచ్చారణలిపి తయారు చెయ్యాలి. ఉదాహరణకి తాటాకు వంటిదే మరోపదంవుంది. ఆపదాన్ని మన ఉత్తరసర్కారుల్లో ఒక విధంగానూ, రాయలసీమలో మరో విధంగానూ, తెలంగాణాలో వేరొకవిధంగానూ, ఉచ్చరిస్తారు. ఆపదం కైజేరు. కైజేరంటే తెలుసుకదూ. అసలు ఉత్తర సర్కారుల్లోని కైజేరుకీ రాయలసీమలోని కైజేరుకీ తెలంగాణాలోని కైజేరుకీ ఆకృతిలోనే భేదంవుంది. ఆ భేదం మీకు ఆవశ్యంగుర్తించాలి. (అటూ ఇటూ వెదికాడు) అరెఇక్కడ రాయలసీమ కైజేరు, తెలంగాణా కైజేరూ కనిపించవే. సరే. ఎక్కడ పెట్టానో. ఇదిగో ఉత్తర సర్కారుల్లోని

కైజేరు. (టేప్‌రికార్డరు ప్రక్కనుంచితీశాడు) చూడండి. (చూపించాడు) ఉత్తర సర్కారుల్లో దీన్ని కైజేరు అంటారు. కైజేరు. ఏదీఅనండి. కై

శార:- కై

అధ్యా:- జేరు

శార:- జారు

అధ్యా:- జేరు

శార:- జారు

అధ్యా:- జేరు

శార:- జారు

అధ్యా;-జారుకాదు. జేరు. కైజేరు కైజేరు కైజేరు.

(అంటూ ఉగ్రంగా మీదికి వెళ్ళాడు)

శార;- కైజారు

అధ్యా;- అలా కాదు సరిగా అనండి. కైజేరు కైజేరు కైజేరు

శార;- అబ్బ! చెవిపోటుకూడా వస్తోంది.

అధ్యా;- ష్. సరిగ్గా అనండి. కై - జేరు

శార;- కై - కై - అబ్బ! (చెవులుపట్టుకుంది)

అధ్యా;- ఆ చెవులూడదీసి అవతల పారేస్తాను. పీడవదులుతుంది. ఊం. సరిగా అనండి. కైజేరు. కైజేరు.

శార;- అలా ఉత్తరసర్కారుల్లో అంటారాండి?

అధ్యా;-అదంతా నీకనవసరం. నేచెప్పేను. విను. అంతే. ఊం. కైజేరు. కైజేరు. కైజేరు.

శార;- కై - జేరు.

అధ్యా;- ఆఁ. అదీ సరైన ఉచ్చారణ! (అంటూ దూరంగా వెళ్లాడు) ఏదీ. మళ్ళీ అను.

శార;— (నీరసంగా) కైజారు.

అధ్యా;- అదిగో! మళ్ళీ అంతలోనే మారిపోయింది. ఈ సారి మరి సరిగ్గా అనకపోతే ఈ కైజేరు ఒక్కపోటుతో -

శార;- (ఉలిక్కిపడి లేస్తూ)ఒక్కపోటుతో?

అధ్యా;- సరిగ్గా అనిపిస్తుంది.

శార;- ఆఁ. (ఒక్కపరుగులో వీధిలోకి వెళుతుండగా)

అధ్యా;- ఆగు. (అంటూ అనుసరించగా ఇద్దరూ వీధిలోకి వెళ్ళిపోతారు. అధ్యాపకుని అరుపుతో లోపల్నుంచి విశ్వనాథంవచ్చేడు. వీధివంకచూస్తూ "అబ్బాయ్!" అని మెల్లగా అటు వెళుతుండగా వీధిలోంచి అధ్యాపకుడు వచ్చేడు. చేతులికీ ఒంటికి రక్తమయింది.)

విశ్వ;-ఎంతఘోరంరా...ఇది నలభయ్యోసారి నీ పాఠాలకి నరబలి... గణితశాస్త్రం నుంచి భాషాశాస్త్రం. భాషాశాస్త్రం ముదిరి మారణహోమం. ఇది విజ్ఞానదేవత విలయనృత్యం.

—♦ తెర ♦—

ధూళిపాళ శ్రీరామమూర్తి

# జీవుని వేదన

## భవభూతి — కరుణరసము

కావ్యానుభూతి జీవవేదనాత్మకమనియు, జీవుని వేదనయనగా అంతఃకరణ మంతః ప్రవణమైనపుడు జీవుడుపొందు స్వరూపావగతి యనియు, బూర్వ వ్యాసములందు నిరూపింప బడినవి. వాల్మీకి యలౌకికశోకము, కాళిదాసు పర్యుత్సుకత్వము నేతాదృశ జీవ-వేదనా స్వరూపమైనవని మనము గమనించితిమి. భవభూతి నిష్కర్ష కూడ నిదియే. భవభూతి చెప్పిన కరుణరసము జీవునివేదన తప్ప వేఱుకాదు. సర్వభావములు జీవుని వేదనయందే పర్యవసించుననియు సర్వానుభూతులందును జీవునివేదనయే యవిచ్ఛిన్నముగ వ్యాపించి యుండుననియు భవభూతి సిద్ధాంతము.

భవభూతి తన సిద్ధాంతమును ప్రతిపాదించుటకు పవిత్రమైన సీతారాముల విరహకథ గైకొన్నాడు. లౌకిక శోకము విరహమునుండి పుట్టుచున్నది. జీవునియొక్క జీవత్వస్థితికూడ విరహజన్యమైనదే. లౌకిక విరహము సాపేక్షము. జీవుని విరహవేదన నిరపేక్షము. ఈసాపేక్షమైన విరహమును ప్రస్తరించి నిరపేక్షమైన జీవుని వేదనను పొంగులార్చి చూపించినాడు భవభూతి.

లోకమున నేవస్తువు తోడి విరహమైనను శోకహేతువే యగును. కాని యా వస్తువుయొక్క ప్రాముఖ్యమునుబట్టి లౌకిక శోకమునం దనంతమైన భేదము కల్గును. లోకమున సర్వవిరహములందును ప్రియజన విరహము తీవ్రమయినదగుట సర్వానుభవ సిద్ధము. ఆ ప్రియజన విరహము దోషప్రేరితముగా కాక ధర్మప్రతిపాలనార్థ మయినపుడు దానియందు మిక్కిలి తీవ్రత్వముండును. మఱియు నది యుత్కృష్ట పురుషాశ్రితమయినపుడు, చెప్ప వలసినది లేదు. సీతారాముల విరహకథ యిట్టిది. స్వభావతః సీతారాములందు దివ్యత్వమున్నది. లౌకికమయిన శోకభావము తీసికొని సీతారాములయం దారోపించి దానియందు దివ్యత్వమును సంఘటించినాడు భవభూతి. మొదలు పెట్టుటతోడనే ఆకసములో మొదలు పెట్టినాడు.

ఈ శోకభావము నుజ్జ్వలముచేయుట కనుకూలముగ భవభూతి తన సంవిధానకమును నిర్మించుకొన్నాడు. ముఖ్యముగ నుత్తరరామచరితమందలి తృతీయాంకమునం దీ శోకభావము పరాంకోటి నందుకొన్నది. ఇందే భవభూతి సంవిధానకము నిర్మించెను. ఈ తృతీయాంకమునకు ఛాయాంకమని పేరు. కాళిదాసుని శాకుంతల పంచమాంక మెట్టిదో యిది యట్టిది. కాళిదాసు చిత్రించిన సంవిధానకమును భవభూతి తిరుగవేసి చూపించినాడు. ఒకే సంవిధానముయొక్క ఒకప్రక్క కాళిదాసు ప్రదర్శింపఁగా రెండవప్రక్క భవభూతి ప్రపంచించినాడు. ఎదుట కన్పించిన శకుంతలను దుష్యంతుడు తిరస్కరించి పర్యుత్సుకుడైనాడు. ఎదుట కన్పించని సీతను గుర్తించి శ్రీరాముడు దుఃఖించినాడు. సీతారాము లిద్దఱు నచ్చటనేయున్నారు. సీతకు రాముఁడు కన్పించును. కాని రామునకు మాత్రము సీత కన్పించదు. ఐనను దైవగతి యట్టిది. సీతారామసమాగమము శోకోద్దీప

కమే యైనది. పంచవటీ దర్శనమున రామునకు సీతావిరహ ముద్దీప్తమగును. రాముడు మూర్ఛిల్ల సీతాస్పర్శ రాముని ప్రబోధితుని జేయును. ఈ స్పర్శ ఈ తృతీయాంకము నిట్లు నిర్మించుటలోని ముఖ్యమర్మము. కాళిదాసుని శాకుంతలమునందలి శాపమెట్టిదో యిచ్చటి స్పర్శ యట్టిది. శాకుంతలమునందు శాపము లేనిచో నుత్తరకథ లేదు. కథా సంవిధానమునందలి మర్మమంతయు నా శాపమును నిర్మించుటలో నున్నది. కాళిదాసు చెప్పదలచుకొన్నది పంచమాంకమునుండి తర్వాతికథను. అదంతయు నతనికల్పన. ఈ కల్పనమంతయు శాపముపై నాధారపడియున్నది. అట్లే ఉత్తరరామచరిత్రమం దీ స్పర్శ లేనిచో నీ కథలేదు. తృతీయాంకము లేదు. ఛాయా సీత లేదు. మఱియు నీ స్పర్శప్రధాన భావమైన శోకమును మిక్కిలి యుద్దీప్తము చేయుచున్నది. మూర్ఛితుడైన రాముని ప్రబోధించుటకు సీతా స్పర్శకంటె వేఱుపాయము లేదని భవభూతి కల్పన. ఇందుచే రామునియొక్క అనుభూతిగాఢత్వము వ్యాజ్యమానమై రామదుఃఖమునందు తీవ్రత్వమును సంపాదించుచున్నది.

రామునియందు మోహము అనగా - నింద్రియ పరిమూఢత ఎంతగాఢముగా నుండు ననగా దక్కిన శీతలోపచారములాతని యందు పనిచేయవు. ఒక్క సీతాస్పర్శయే రాముని యంగకములకు దెలియును. సీతా స్పర్శయందు తప్ప మఱొక స్పర్శయందు రామునకు రమణము లేదు. అంత అవ్యభిచారి యైన మనస్సు రామునిది. అసలు రమణము యొక్క మర్మమంతయు స్పర్శగుణము నాశ్రయించి యుండును. భగవంతుని స్పర్శగుణము నుండి కామముపుట్టినది. అందుచే రమణము కామప్రేరితమై స్పర్శయందు పర్యవసించునది. స్త్రీపురుషసాంగత్యమంతయు నీ స్పర్శ నాశ్రయించియేయున్నది. అందుచే జీవుని యంతఃకరణమును బహిఃప్రసృతము చేయునది ఈ స్పర్శగుణముకంటె మఱొకటిలేదు. జీవుడన్న పశువును విషయములన్న యంతఃకరణమునకు గట్టివేయు త్రాడే స్పర్శగుణము. సర్వేంద్రియవ్యాపార మీ స్పర్శగుణము నాశ్రయించి యుండును. ఒక్కమాటలో జీవచైతన్యమున కావరకమయిన యజ్ఞానమంతయు నీ స్పర్శగుణముగా వికసించెనని చెప్పవచ్చును.

రాముడు మూర్ఛిల్లెననగా రాముని యంతఃకరణ మింద్రియసన్నికర్షము వదలి సమాధిభావమును పొందియున్నదన్నమాట.

రాముని సమాశ్వస్తునిచేయక కథలేదు. రాముని యంతఃకరణమును బహిః ప్రసృతము చేయుటకే స్పర్శను ప్రవేశపెట్టినాడు భవభూతి. అట్టి స్థితిలోకూడ సీతాస్పర్శ రాముని యంతఃకరణమును బహిః ప్రసృతమునుచేయుశక్తి కలది. ఈ స్పర్శవల్ల రామునియొక్క సీతైక విషయ కాభిరమణము వ్యక్తమగుచు రాముని దుఃఖతీవ్రత్వమును ద్యోతకము చేయుచున్నది. ఈ స్పర్శయం దిట్టి శోక వ్యంజకతను సాధించుటకై దీనిని మొదటి నుండి కథతోబాటుగ నల్లికొనివచ్చినాడు కవి. కథ చివరివఱకును కొనసాగించినాడు కవి. అందుచేత సంవిధానక నిర్మాణమంతయు నీ స్పర్శగుణముపై నాధారపడిన దంటిని.

ఈ స్పర్శ కిట్టి ప్రాధాన్యమును నిర్దేశించినాడు కావున ప్రథమాంకమందే దాని తీవ్రత్వమును భవభూతి రామునిచే వ్యాఖ్యానింప జేసెను. రాముడనును.

విని శ్చే తుం శక్యో నసుఖమితివా
దుఃఖమితివా
ప్రమోహో నిద్రావా కిమువిషవిసర్పః
కిముమదః
తవస్పర్శే స్పర్శే మమ హి పరిమూఢేం
ద్రియగణో
వికారశ్చైతన్యం భ్రమయతి
సమున్మీలయతిచ।

**సీతా!** నీ స్పర్శచేత నెదియో చెప్పరాని యొక యనుభవము నా యింద్రియ సమూహమును స్తంభింపజేసి జీవచైతన్యమును గల్లోలపెట్టును. వికసింపజేయును. ఇది సుఖమో దుఃఖమో చెప్పజాలను. ఇది మోహమో నిద్రయో కావచ్చును. విషవిసర్పము వంటిది కావచ్చును. లేక మత్తు కావచ్చును. ఇచ్చట **సీతా** స్పర్శవల్ల రాము డనుభవించినది జీవుని వేదనయని యీ శ్లోకమందు కవి స్పష్టము చేసినాడు. ఈ స్పర్శవల్ల కలిగిన యనుభూతి సుఖముకాదు. దుఃఖముకాదు. శరీరమునకు మూర్ఛకలిగినట్లు - నిద్రవచ్చినట్లు విషము ప్రసరించినట్లు - మత్తుకలిగిన ట్లొకనిస్తబ్ధత కల్గినది. దీనివల్ల ఇంద్రియములు పరిమూఢము లైనవి. అనగా నంతఃకరణము ఇంద్రియ సన్నికర్ష తొలగి వెనుకకుదిరిగిన దన్నమాట. ఈ స్పర్శవల్ల కల్గిన వికారము - అనగా - అంతరవస్థా విశేషము వట్టి శారీరకమైన యనుభవముకాదు. ఇది మానసికమైనదియుకాదు. ఇది సుఖదుఃఖముల కతీతమైనది. ఇచ్చట చైతన్యశబ్దమునకు జీవచైతన్యమని యర్థము చేయవలయును. జీవచైతన్యమనగా నంతఃకరణావచ్ఛిన్నచైతన్యము. ఈ స్పర్శానుభవము ఆ జీవచైతన్యమును కలగజేసినది. వికసింపజేసినది. సీతాస్పర్శ - ఇంద్రియములను దాటి మనస్సునుదాటి యంతఃకరణమునుదాటి జీవసంపుటియందు ప్రవేశించినది. జీవసంపుటి నూచిముట్టుగ కదలించినది. అచ్చట ఒకపొంగు - ఒక వికాసము కల్గించినది. జీవసంపుటియందలి యీ పొంగు - యీ వికాసమే జీవునివేదన. అదియే భవభూతి చెప్పిన కరుణము.

అనగా నే యనుభూతియైన నేభావమైన నంతలోతుగా ననుభూయమానమైనపు డది జీవునివేదనయే యగునన్న మాట. ఈ స్పర్శయొక్క - శారీరకానుభవము - మానసికానుభవము జీవసంపుటియందలి యనుభవము వీనియందలి భేదములును ఈ శ్లోకమందు నిరూపితమయినది. రాము డనుభవించిన యనుభూతి శరీర - శరీరేంద్రియ మనస్సులను దాటి జీవచైతన్యమువఱకు వ్యాపించినది. అందుచేతనే మూర్ఛితుండైన యనగా జీవచైతన్యమువఱకు స్తబ్ధుడైన రాముని నుద్బోధితుని చేయగల్గినది. తృతీయాంకమునందలి సంవిధానకమున నిట్టి యుపయోగమున కర్హమయిన దానినిగ నిచ్చట నీ స్పర్శను చిత్రించినాడు భవభూతి. శ్రీరాముని జీవసంపుటిని కదలింపగల్గినదీ స్పర్శ. అనగా శ్రీరాముని యంతఃకరణమును జీవసంపుటిలోని కుపసంహృతము చేయగల్గిన దీస్పర్శ. జీవసంపుటియం దుపసంహృతమైయున్న యంతఃకరణము నింద్రియసన్నికర్షను బొందింపజేయున దీస్పర్శ. అందుచేతనే "భ్రమయతి - సమున్మీలయతిచ" యన్నాడు.

ఇంతప్రబుద్ధమైన జీవునివేదన కలవాడు రాముడు. ఇంతగాఢశీలి. సీతాసంయోగమునందే రాముని యనుభూతి యిట్టిది. ఆమె వియోగమునందెట్టిదో చెప్ప నక్కర లేదు. సీతాసంయోగ వియోగములు రెంటను రాము డనుభవించునదీ జీవునివేదనయే. తృతీయాంక

మును మొదలుపెట్టుచునే యీ సంగతినిస్పష్ట పఱచినాడు భవభూతి. తృతీయాంకమంతయు మహాశోక ప్రవాహము. జీవుని వేదనా ప్రవాహము. అంకమంకమంతయు నగ్నిమయమైన సృష్టి. అంకముయొక్క మొదట నొకశ్లోకము చివర నొకశ్లోకము కట్టలుకట్టి ఈ కట్టలమధ్య ఈ వేదనాగ్నిని ప్రవహింపజేసినాడు భవభూతి. మొదట మురళయనును.

అనిర్భిన్నో గభీరత్వాత్ - అంతర్గూఢ గురువ్యథః।

పుటపాక ప్రతీకాశో రామస్య కరుణో రసః॥

గంభీరుడగుటచేత పైకివేఱుగా కన్పింపకున్నను లోపల గూఢముగా గొప్పబాధపడు - చున్నాడు ఈ రాముని ఈ దుఃఖము పుటము పెట్టినట్లు కరుణ - రసమయినది.

రాముడు పైకి నెమ్మదిగకన్పించినను లోలోపలనీ యగ్నియందు విపచ్యమానుడగుచునేయున్నాడు. సీతావియోగజన్య మయిన రామశోకము నిరంతరానుభవమువలన కరుణ రసమయినది.

రాముని శోకము జీవసంపుటియందునను భూయమానమగుచున్నది. పైకి వెళ్ళగ్రక్కుటకువీలు లేనిది. గూఢముగాననుభవింపవలసినది. అందుచేత నా జీవసంపుటియందే విపచ్యమానమయినది. బంగారమును పుటమువేసినపుడా యగ్నిజ్వాలలుపైకి వ్యాపించుటకు వీలులేదు. అగ్నిజ్వాలలుపైకి వ్యాపింపకుండ మట్టికప్పుదురు. ఆ బంగారమా యగ్నిలో లోలోపల దహింపబడి దానియందలిమాలిన్యమంతయు విగళితమయి స్వచ్ఛమగును. రాముని శోకమట్టిది. అంతరనుభూయమానమయిన రామశోకము లౌకిక మాలిన్యము పసగతముకావించుకొన్నది. జీవసంపుటిప్రవిష్టమయి కరుణారసముగా మారినది. శోకమువల్ల రాముని జీవసంపుటి యందొక యుద్దీప్తి - ఒక తేజస్సుకల్గినది. అనగా రామునియందు జీవచైతన్యము. పరిశుద్ధమయి సమున్మీలనము పొందిన దన్నమాట. సీతావియోగజన్యలౌకిక శోకమిట్లు జీవవేదనాత్మకమయి రాముని యందలౌకికత్వము పొందినదన్నమాట.

పుటపాక ప్రతీకాశో - రామస్య కరుణో రసః, అన్నమాట కర్థమిది. ఇప్పుడు రాముడనుభవించుచున్న కరుణమునకు సీతావియోగము కారణముకాదు. వ్యంజకముమాత్రమే. సీతావియోగమిప్పుడు రామునకు క్రొత్తగా సంఘటించలేదు. అందుచేత తృతీయాంకమందు రాముడనుభవించిన యనుభూతి సీతావియోగజన్యమయినది కాదు. అదిరాముడు పూర్వమునుండియనుభవించుచునేయున్నాడు. ఆయనుభవమతని జీవసంపుటియందు లీనమైయున్నది. పంచవటీదర్శనము ఆలీనమైయున్న వేదనమును జ్వలింపజేసినది. అనగా పంచవటీదర్శనము వలన స్మర్యమాణమైన లౌకిక సీతావృత్తాంతము రామచంద్రహృదయ గత విపచ్యమానమగు జీవవేదనమును వ్యంగ్యమొనరించినదని చెప్పకొనక తప్పదు. అంతర్లీనస్య దుఃఖాగ్నేః - అని భవభూతియనుటలో నున్న మర్మమది. రాముడు పొందిన బాధ ప్రాతనొప్పి బైటపెట్టుటవంటిది. గుండెలోపొందిన కలుకువంటిది.

యథా తిరశ్చీన మలాతశల్యం, ప్రత్యుప్తమంతస్స విషశ్చదంశః

తథైవ తీవ్రో హృది శోకశంకుర్మర్మాణి కృంతన్నపి - కిం నసోఢః

రాముని హృదయమునందు నలాతశల్యము వలె - విషదంశమువలె - శోకశంకువు గ్రుచ్చుకొనుచునేయున్నది. దానిబాధ నాతడనుభవించు - చునేయున్నాడు. పంచవటీ దర్శనము

దానిని కదల్చినది. అంతఃప్రసరణ శీలమైన యంతఃకరణమును రాముడతి ప్రయత్నముగా బహిఃప్రసరణముగావించుకొనుచు నిన్నాళ్లును వచ్చినాడు. పంచవటీ దర్శనమువలన మఱల రాముని హృదయము సంక్షుబ్ధమయినది. అనఁగా రాముడెట్లో యణచుకొనుచు వచ్చుచున్న జీవునివేదన మఱల విజృంభించినది. ఆయనయంతఃకరణము జీవసంపుటి యందు మగ్నమయినది. ఇదియేరామునిమూర్ఛ. అంతర్హితమైయున్న సీతాస్పర్శరామునుజ్జీవితు జేసినది. ఆ సీతాస్పర్శరాముని జీవసంపుటి లోనికి ప్రవేశించినది. అతని యంతఃకరణమునకు బహిఃప్రసరణమును సంపాదించినది. పంచవటిలో ప్రవేశించినది మొదలు రాముని మనసునందు సీత యాడుచునేయున్నది. ఆ సర్వప్రదేశములయందు సీతాపరిచయముద్ర నిండియున్నది. అచ్చట నిండియున్న సీతా విషయక పరిచయము రాముని మనోగతమైన సీతాచ్ఛాయనుద్బోధించినది.

ఆ యా పంచవటీపరిచితప్రదేశజ్ఞాపిత సీతయే నిజమునకు ఛాయాసీత. ఆ ఛాయా సీతకు ప్రతీకగా భవభూతి సత్యసీతను ప్రవేశపెట్టి యంతర్హితను గావించినాడు. రాముని వియోగాగ్నిని రగులించిన సీత యా పరిచిత ప్రదేశములయందు మఱుగువడియున్న రామ మనస్సృష్టమయిన ఛాయాసీత. అసలు సీత చేయి రాముడు గ్రహించినను తర్వాత నది తన మనస్సృష్టియను కొన్నాడు. అంతర్హిత సత్యసీతను ఈ ఛాయాసీతకు ప్రతీకగానీ యంకము మొదటినుండి తుదిదాకనిలిపి బహు విచిత్రమయిన సంవిధానకమును సృష్టించినాడు భవభూతి.

వట్టి మనస్సృష్టసీతనే నిరూపించినచో గరుణారసమునందింత యుద్దీప్తి వచ్చియుండెడిదికాదు. అంతర్హితమైన సీత విరహావేదనము శోకభావమునం దుద్దీప్తి తెచ్చుటకు హేతువైనది. సీతారాముల సమ్ముఖమునందు ననుభవించుచున్న విరహము సంవిధానక సృష్టికి కారణమయినది. అంకాంతమున సీతారాములు విడిపోవుచున్నారు. సీత మూర్ఛిల్లును. తమస యామెనాశ్వాసించును. సీత యనును.

"కియచ్చిరం వా మేఘాంతరేణ పూర్ణ
చంద్రదర్శనం"

ఇప్పటికే యీ మేఘము దైవము పట్టిన తెర. ఇదియే సంవిధానకము. ఈ విధి బలవత్తరమయినది కావున నీ సమ్ముఖమ్మునందు విరహము ననుభవింపవలసివచ్చెను. సీతారాములకు సంయోగము కల్గియు శోకోద్దీపకమయినది. ఇచ్చట సంక్రాంతమందు కవి మఱొక శ్లోకమువ్రాసి యీ మహా ప్రవాహమునకు రెండవ కట్టవేసెను.
తమసయనును.

ఏకో రసః కరుణ ఏవనిమిత్త భేదా
ద్భిన్నః పృథక్ పృథగివా
శ్రయతే వివర్తాన్
ఆవర్త బుద్బుద తరంగమయాన్ వికారా
నంభో యథా సలిలమేవహి తత్సమస్తం.

ఈ శ్లోకమందు కవి యొక మహాసిద్ధాంతమును స్థాపించినాడు. ఈ శ్లోకము వాల్మీకి కాళిదాసుల యభిప్రాయములకు వ్యాఖ్యాప్రాయ మయినది. వాల్మీకి కాళిదాసు లేది సూచించిరో దానిని కంఠోక్తిగ సిద్ధాంతరూపముగ భవభూతి యీ శ్లోకమందు నిరూపించినాడు. కరుణయొక్కటియే రసము. నిమిత్తభేదమువల్ల శృంగారాది రూపముగ వేఱువేఱుగ కన్పించును. అది యూరక కన్పించుట మాత్రమె. నీరు నుఱుగు బుడగలు

తరంగములుగా కన్పించవచ్చును. కాని యథార్థమున కొక్కటే నీరు.

కరుణ మనగా నిమిత్తనిరపేక్షమయిన శోకమని యర్థము. నిమిత్త సవ్యపేక్షమయినచో దానియందు రసత్వ ముండుటకు వీలు లేదు. అది కరుణమగుటకు వీలులేదు. లౌకిక శోకము నిమిత్త సవ్యపేక్షము. భవభూతి చెప్పిన కరుణ మట్టిదికాదు. అది పూర్వము నిరూపించినది. నిమిత్త నిరపేక్షకమయిన శోకము జీవునియొక్క స్వరూపమే. జీవుడు స్వభావస్థితుఁ డైనపుడు అనగా అంతఃకరణమున కింద్రియ సన్నికర్ష లేనపుడుండు భావ మీ శోకము. జీవుడనగా నజ్ఞానావచ్ఛిన్నచైతన్యము. ఈ యజ్ఞానమనాదిసిద్ధము. దీనికి యోగశాస్త్రమందు "ఆశీః" యనిపేరు. ఇది నిరంతరము నాకు సుఖసాధనములతో సాన్నిహిత్యముండుగాక. నాకు దుఃఖము కలుగకుండుగాక. దుఃఖసాధనములతో నాకు సంయోగము లేకుండుగాక యను నొకానొక కోరికరూపమున నుండును. లోకమున సర్వజీవులు సుఖమును కోరుదురు. దుఃఖమును నిరసింతురు. ఒక డొక వస్తువును కోరెననగా నది వానికి లేదన్నమాట. జీవుడు సుఖమును గోరుచున్నాడనగా నదివానికి లేదన్నమాట. సుఖములేనిచో నుండునదేమి? దుఃఖము. జీవునకీయున్న దుఃఖముపోయి లేని సుఖము రావలెను. కాని జీవునకీ దుఃఖమెందుకు కల్గినదో ఆ సుఖ మెందుకు కావలెనో తెలియదు. ఈ తెలియకపోవుటయే యజ్ఞానము. ఈ యజ్ఞానముయొక్క ప్రథమ విలసనము దుఃఖము. యథార్థమునకు జీవుడు నిరవధిక సుఖస్వరూపమైన చైతన్యముయొక్క యంశ. తాను నిరవధిక సుఖస్వరూపుడనని జీవుడు మఱచిపోయినాడు. అందుచేత జీవునికి జీవత్వముతోబాటు దుఃఖమున్నది. ఈ దుఃఖమే శోకము. ఈశోకము మూలభూతమైనది. జీవునకు జీవత్వ సంపాదకమైనది. అజ్ఞానమువల్ల కలిగినది. అందుచే నబోధపూర్వమైనది. ఇట్లు సర్వభావములకు ఈ శోకము మూలస్తంభము. ఈ మూలభూతమైన శోకము వేఱు - లౌకిక శోకము వేఱు. ఇది జీవునకు జీవత్వస్థితిలో ననుభవగోచరమగునది. జీవునియొక్క యంతఃకరణ మింద్రియ ముఖమున బహిర్విషయ వ్యాప్తమైనపు డీ మూలభూతమైన శోకభావమే బహువిధములుగ బ్రవర్తించును. ఆయా విషయముల నాశ్రయించి బహ్వనుభవములు పొందును. ఈ యనుభవములు జీవస్వరూపమందు మగ్నమై రతిహాసశోకభయజుగుప్సాదిరూపమున నీ శోకమునందే స్థిరపడియుండును. జీవునియొక్క స్వరూపము శోకము. దానిపైనబడ్డ రంజనములు తక్కిన భావములు. అంతఃకరణ మంతఃప్రవణ మైనపు డీ భావములు శోకమునందు బర్యవసించుచుండును. ఫలితార్థ మేమన సర్వభావములు నిమిత్త సవ్యపేక్షములై భిన్నములైనను స్వరూపమునందు శోకమే. బాహ్యమైన నిమిత్తములు తత్తద్భావముఖమున నీ శోకమునే వ్యంజింపజేయుచుండును. తత్తద్విషయాశ్రితమై తత్తద్భావస్వరూపమున నీ శోకమే పరిణమించుచుండును.

ఏ భావమైన నేదోయొక రంగువేసిన శోకముమాత్రమే - అందుచే నే భావమయినను ప్రసంచిత మయినపుడు జీవుని జీవత్వస్థితియందు తాడితి మొనరించుచుండును. జీవుని జీవసంపుటి నూచముట్టుగ కదిలించివేయును. జీవునికి స్వస్వరూప మనుభవములోనికి దెచ్చును. జీవుని కనుభవ గోచరమగు

నీ శోకభావమునకే కరుణమని పేరు. ఇదియే జీవుని వేదన. ఆయా భావములు ప్రపంచిత ములైనపుడు వాని రంజనముమాత్రము దీని యందుండవచ్చును. దానినిబట్టి శృంగారాది నామవ్యవహారము కలుగవచ్చును. ఐన నను భవమునకు వచ్చునది జీవుని వేదనయే. ఇచ్చట వేదనయన జీవచైతన్యమునందు కలుగు దీప్తి.

యథార్థమునకీ చైతన్యము పరమేశ్వర స్వరూపము. అచ్ఛమయిన వెలుగు. భవ భూతి ఈ మూలభూతమయిన శోకభావ మును, జీవస్వరూపమును పట్టుకొని సాగగొట్టి నాడు. ఆ శోకభావమునందు పరమేశ్వరుని వెల్లునిండించినాడు. అదియే కరుణరసము. జీవుని వేదన.

చంద్రోదయ మవుతూవున్నది. గోడవారన వున్నా గచెట్టుఅకాలంలో పూలుపూసింది. మంచివాసనలు వస్తున్నాయి. సూర్యం బజారు నుంచి ఇంటికివచ్చి "అమ్మా వేణ్ణీళ్ళు వున్నవా ?" అని అడిగాడు. ఆమె "లేవు" అన్నది. సూర్యం విసుక్కున్నాడు. ఈ విసుక్కోవటం అతడి కివాళ కొత్తగాదు. జ్ఞానం తెలిసిన రోజునుంచీ ఇలానే విసుక్కుంటున్నాడు. రోజుకు వందసార్లు చచ్చిపోతుంటాడు. ఇంట్లో యెవరికీ తనమీద అభిమానం లేదు. అప్పులవాళ్ళందరూ యమదూతలు, అని అతడిభావన.

ఇవాళ జీవితంలో ఇరవై రెండో యేడు గడుస్తున్నప్పుడు కోరికలకు జీవసమాధులు కట్టి, అసంతృప్తిని అందలం యెక్కించి, ఆందోళన వూపిరిగా బ్రతుకుతున్న సూర్యం అలా విసుక్కోవటంలో బేసబబు యేముంది? భావిదగ్గర అలానే నాలుగుబొక్కెన్లు చన్నీళ్లు మీద కుమ్మరించుకుని వచ్చాడు. ఇంట్లో వాళ్ళందరిపైనా చెప్పలేని కసిగావుంది. ఆర్ద్రమైన మనస్సు దేనికో అలమటించిపోతున్నది. వసారాలో తండ్రి దుప్పటి వొకటి వొంటి నిండా కప్పుకుని కూచున్నాడు. అల్లంత దూరాన "కాళంగి మడుగుదరికి బోకురా కృష్ణ... కాళంగిమడుగుదరికి..." అని పాడుకుంటున్న తల్లి, "ఈవేళప్పుడు చన్నీళ్ళెందుకు పోసుకున్నావు నాయనా" అన్నది పాట ఆపేసి. సూర్యం సమాధానం చెప్పలేదు. ఏ సమాధానం చెపితే వాళ్ళ మనస్సుకు బాగా కష్టం కలుగుతుందో అతడి ఆలోచనకు తోచలేదు. మాట్లాడకుండా వొకపక్క తడికెల గదిలోకి వెళ్లి కూచున్నాడు. తాను చొక్కా తొడుక్కుని పైన స్వెట్టర్ తొడుక్కుంటుంటే తండ్రి చొక్కా తొడుక్కుని మూడేళ్ళు కావస్తున్నదన్న విషయం కొత్తవిషయంలా మనసున స్ఫురించింది. అతడి మనసు యెందుకోఆర్ద్రమైపోయింది.

బయట దూరాన పెళ్ళిమేళం వినిపించింది. సన్నాయిస్వరం అలలుఅలలుగా తేలివస్తున్నది. పెళ్ళి ఊరేగింపు దూరంనుంచి దగ్గరగా వస్తున్నది. పెళ్ళి ఊరేగింపును చూడాలంటే సూర్యానికి కోపం. ఎందుకో అతడికి మనస్కరించదు. తలక్రింద దిండుపెట్టుకుని చాపమీద పడుకున్నాడు. పెళ్లిమేళం తమ వీధిలోకే వచ్చిందన్న విషయం స్పష్టమైంది. తమ ఇంటిముందుకే వస్తున్నది. దానితోపాటు అవమానంలాంటి బాధ, ఉక్రోషం, తనమీద తనకు కసి, జాలి, యేమిటో యేమిటో అత డనుకున్నట్లుగానే అయింది.

రాజేశ్వరి నెమ్మదిగా వీధిలోకి నడిచింది. సీతాలక్ష్మి పరిగెత్తింది. శారద వొక్కగంతున పెళ్ళి వాకిట్లో నిలుచుంది. యశోద మొఖమింత చేసుకుని వెళ్ళింది. రాధకూడా వెళ్ళింది.

సూర్యానికి యేడుపొచ్చింది.

వీళ్ళు ఐదుగురూ ఆడపిల్లలు. సూర్యంతో కలసి ఆరుగురు సాంబయ్యగారికి పిల్లలెంత మందికి సమాధానం.

రాజేశ్వరి వయస్సు ఇంట్లోవాళ్ళు యెప్పుడూ అనుకోరు. సూర్యంకన్న మూడేళ్ళు

పెద్ద. సీతాలక్ష్మికి పద్ధెనిమిది. శారదకు పదహారు. అలానే యశోదకు పధ్నాలుగు. చిన్నపిల్ల రాధకు పన్నెండు.

రాజేశ్వరికి పెండ్లికాలేదు. కాదు, అని కొందరు. తక్కిన వాళ్ళకూ కాలేదు అని.

పెళ్ళి ఊరేగింపు అర్ధగంటదాకా ఆ వీధిలో నేవుంది.

వాళ్ళ ఐదుగురు ఆడపిల్లలూ అరుగుల మీద నిల్చొని కొందరూ, కూచునికొందరూ, సూర్యం కళ్ళలో నీళ్ళలో వాళ్ళమీద కోపం.

వాళ్ళు యెందుకు అలా వెళ్లి నిలుచోవాలి? చప్పునచూసి యెందుకు ఇంట్లోకి వచ్చెయ్యకూడదు?

ఐదుగురి మధ్యన తాను వొక్కడు యెందుకు పుట్టాడు.

పుట్టుట గిట్టుటకొరకే అంటారే? తాను యెందుకు గిట్టలేదు?

వీళ్ళకు పెళ్ళిళ్ళు యెలా అవుతాయి. వాళ్ళ కళ్ళలోని ముత్యాల పల్లకీలు, వాళ్ళు అలా ఊరేగుతూవుండగా తాను యెప్పుడు చూస్తాడు. ఎలాచూస్తాడు.

అర్ధగంట గడిచినా వాళ్లు ఇంట్లోకిరారేం! వాళ్ళ మధ్య అమ్మ వెళ్ళి నిలుచుంది. వీళ్ళు తెమిలిరారేం! అమ్మా, రాజా, సీతాలూ, శారదా, యశోదా, రాధమ్మా, ఒక్కరూ రారు. ఈ సన్నాయి వాయిద్యం మనస్సును కలతపెడుతున్నది. ఆర్ద్రమైన మనస్సులో దుఃఖం చోటు చేసుకుంటున్నది.

పల్లకీలో కూచుని ఒకరికేసి ఒకరు చూసుకుంటున్న, అందమైన చిరునవ్వును పెదవుల మీద అణచుకుంటువున్న వధువూ, వరుడూ సూర్యం కళ్ళలో కనపడుతున్నారు. కళ్లు మూసుకున్నా, అలావాళ్ళు కనపడటం సూర్యానికి ఇష్టంలేదు. అలావాళ్ళు నవ్వు మొహాలతో కనపడటం బొత్తిగా ఇష్టం లేదు.

పెళ్ళి ఊరేగింపు దూరానికి కదిలిపోతున్నది.

ఇంకా వాళ్ళు వీధివాకిలినుండి కదలలేదు.

సూర్యం లేచి తడికల గదిలోంచి ఇవతలకు వచ్చాడు.

తండ్రి మధ్యాహ్నం గూట్లో పెట్టుకున్న చుట్టతీసి కాగితంచుట్టి మళ్ళీ వెలిగించుకుంటూ కనపడ్డాడు. సూర్యానికి మనస్సు కలచినట్లైంది. ఆయన యెప్పుడూ ఇలా కాల్చి పారవేసే చుట్టలను జాగ్రత్త చేసుకోవటం యెరుగడు. మూడు సంవత్సరాలక్రితంవరకూ ఉత్తరాది పొగాకుచుట్టలు చుట్టబడి ద్వారబంధం పైన బండమీద భద్రంగా వుండేవి. ఆడబ్బా ఇప్పుడూ వుంది. దాంట్లో ముగ్గుపోసుకుంటున్నారు.

ఇవ్వాళ పొద్దున కోర్టుకు వెళ్లేటప్పుడు తండ్రి తనకు సాయంకాలం వచ్చేటప్పుడు ఒక రెండణాల పొగాకు పట్టుకరమ్మని చెప్పటం సూర్యానికి గుర్తువచ్చింది. కాని తాను తీసుకుని రాలేదు. తండ్రి అడగనైనా అడగలేదు. తెచ్చివుంటే ఇచ్చివుండడా, అనుకుని వుంటాడు. మళ్ళీ తనని అడిగి ప్రొద్దున తాను చెప్పానన్న విషయం జ్ఞాపకం చెయ్యటం కూడా ఇష్టంలేదు తండ్రికి. తనమీద యెంత దయ. ఎంత ప్రేమ.

సూర్యం గిరుక్కున వెనక్కు తిరిగిగాడు. ప్రొద్దున్న తండ్రి తనను అడిగినప్పటి విషయం జ్ఞాపకానికి వచ్చింది.

పచ్చటి యెండలో జామిచెట్టుకు పాదు చేస్తూ ఆవైపుకు తిరిగి కూచునివుంటే తాను చూశాడు. వీపుమీద చర్మం ముడుతలుపడి

పోయింది. శుష్కించిన శరీరంపైన స్వేదబిందువులు ఆ ప్రొద్దుటిపూట యెండలో మెరిసిపోతున్నాయి. సూర్యానికి జాలిఅయింది. "నువ్వెందుకు నాన్నా ఆపని చెయ్యటం!" అన్నాడు.

ఆయన యేమీ మాట్లాడలేదు.

సాయంకాలం వచ్చేటప్పుడు రెండుకాడలు పొగాకు పట్టుకరమ్మన్నాడు.

తాను మరచిపోయివచ్చాడు.

మరచిపోయేవాడు కాడు. కలపకొట్టు యజమాని నిష్ఠూరంగా మాట్లాడాడు.

"మూడేళ్లయింది. ఎప్పుడు తీసుస్తారయ్యా? ఇక్కడ మాకేం గనుల్లేవు. వ్యాపారమంటె డబ్బు తిరగటం. మీరు ఇవ్వకపోతే మా చేతుల్లో యెట్లా వుంటుంది. మీ నాన్నకు తెలుసుగా కోస్ట వ్యవహారం. అక్కడే పుట్టి అక్కడే పెరిగె. వేలాలు వేయించటం కాదు ఇది. మీకు మర్యాద వుండాలి. మా మర్యాదా పోకూడదు."

సర్దిచెప్పి, కాళ్లూ గడ్డాలు పట్టుకున్నంత పని చేశాడు సూర్యం. అందువల్ల మరిచిపోయి వచ్చాడు. మూడేళ్ళ క్రితం తండ్రి రిటైరై పెన్షన్ తీసుకున్నప్పుడు యీ చిన్న ఇల్లు యేర్పాటు చేసుకున్నారు. దాని తాలూకు కలపబాకీ ఇంకా తీర్చలేదు. వీలు చూసుకుని అప్పుడప్పుడు వాడు వచ్చి గొంతు మీద కూచుంటుంటాడు. నానా మాటలు అని పోతుంటాడు. ఇవాళ వీధిలో తారసపడ్డాడు సూర్యానికి దిగులుగా ఇంటికివచ్చాడు బరువుగా. బాధగా. పెళ్ళిఊరేగింపు చాలా దూరానికి వెళ్ళి పోయింది.

చాలా దూరాన్నుంచి సన్నాయి వాయిద్యం ఇంపుగా వినవస్తున్నది.

ఐదుగురాడపిల్లలూ పెళ్ళికొడుకునుగురించే మాట్లాడుకుంటున్నారు.

రాధకి పెళ్ళికొడుకు బాగానేవున్నాట్ట.

యశోదకి పెళ్ళికూతురం బావులేదు.

పల్లకీ యేమిటో మోటుగా-ఇప్పుడు చిన్న కారే ఫేషన్, సీతాలక్ష్మి చెపుతోంది.

మూడువేలు కట్నమిచ్చారటమ్మా. ఫదొందలు సొమ్ముకిచ్చారుట. రాజేశ్వరి అమ్మకు చెపుతున్నది.

సూర్యానికి తలకాయ బద్దలైపోతున్నది.

"పెళ్ళికూతురి మెళ్లో జాజిపూలనెక్లెస్ చూశావుటే అక్కయ్యా" రాధ అడుగుతోంది.

"అచ్చం ఎదురింటి ప్లీడరుగారమ్మాయి మెళ్లోలాంటిదే" యశోద చెపుతున్నది.

సూర్యం మనస్సులోచెప్పలేని దిగులైంది. తన మనస్సుకి నిశ్శబ్దం కావాలి. కాని వాళ్ళు మాట్లాడుకుంటున్నారు. సొమ్ములు గురించి పెళ్లిళ్ళు గురించి. వాళ్ళకు తెలేవు అప్పులు. యమదూతలు. అవమానం. బాధలు. నిరాశ. దుఃఖం. వాళ్లు అమాయకత్వం మూర్తీభవించినవాళ్లు. హృదయాల్లోని కోర్కెలను పోషిస్తున్నవాళ్ళు. జాగ్రత్తగా కోర్కెలను పెంచుకుంటున్నవాళ్ళు. వాళ్ళ అమాయకత్వం చూస్తుంటే తనకు దుఃఖం. వాళ్ళను తలచుకుంటే తనకు జాలి. వాళ్ళభవిష్యత్తును తలచుకుంటే చీకటి.

భగవంతుడు మనుష్యులను యెందు కిలా సృష్టించాడు. ఎందుకింత దుఃఖాన్ని సృష్టించాడు. ఎందుకీ ఆస్పాలని సృష్టించాడు. మగవాళ్లూ, ఆడవాళ్లూ, పెళ్ళిళ్ళూ పిల్లలూ. ఏం చెయ్యాలి. ఎలాబతకాలి. ఎక్కడశాంతి. ఏందుకిన్ని కోర్కెలు.

అమ్మవచ్చింది. "నాయనా అన్నానికి లే-"

"వాళ్ళందరినీ తిని లెమ్మనమ్మా. నేను

తిరువాత వస్తాను." అన్నాడు సూర్యం.

వాళ్లీవరకే అన్నాలు తిన్నారు రా -

వసారాలో తండ్రి దగ్గుతున్నాడు. దీపపు వెల్తురులో తల్లివేపు చూశాడు సూర్యం. ఏభైయేళ్ళ జీవితం యెన్నో అనుభవాలను చెరగిపోని ముద్రలుగా చేసేవుంచింది. ఆమె మీద. పదిమందినికన్నది. ఎంతమందో పుట్టటం చూసింది. ఎన్నిచావులోచూసింది. పిల్లలకు జ్వరాలు. ఇంటాయనకు జ్వరం.జబ్బులు. ఇటూ,అటూ అన్నగడియలు. మొక్కుబడులు. వ్రతాలు. ఉద్యాపనలు. పిల్లలకు ప్రొద్దస్తమానంచాకిరీ. తెల్లవారా, ప్రొద్దుగూకా. వంటా, వార్పాకంచాలు కడగటం. మధ్య మధ్య రేవనింగులు.ఊదాత్తులు నలిగించి దేవుడి పటానికి గుచ్చిన యీ చేతులు, మల్లెపూలు దండలుగుచ్చిన యీ చేతులు, భర్తకాళ్ళు పిసికి, పిల్లలకు అన్నం నోట్లోపెట్టిన యీ చేతులు, జొన్నల్లో పోటేసి, తొక్కుతోం పాయి. రేవనింగురోజుల్లో బాగా గుర్తు సూర్యానికి. తల్లివేపుచూడలేక పోయినాడు.

రాత్రి నిద్ర పట్టలేదు సూర్యానికి.

నిజానికి తనకు తండ్రిమీదా, తల్లిమీదా కోపం యెందుకు? విసుకుయెందుకు ? తన అక్కలూ చెల్లెళ్లూ బంగారు తల్లులు. వాళ్ళ మీద తనకు కోపమెందుకు? విసుగెందుకు?

తనని స్కూలు ఫైనల్‌తోనే చదువు మాన్పించారనా ?

తనకు ఇంటా బయటా శాంతిలేకపోయెనే అనా ?

తనని తీసుకవెళ్ళి కోర్టుగుమాస్తాగా పద్దెనిమిదేళ్ళకే చేర్పించదరనా ?

అవును తన తండ్రి కోర్టు అమీనా. ఐదుగురు ఆడపిల్లల తండ్రి. పిత్రార్జితమైన ఆస్తి పాస్తులు యేమీ లేనివాడు.

ఎలా బ్రతకాల మరి. అందుకని తాను రిటైర్ కాకముందే పలుకుబడిని వినియోగించి స్కూలుఫైనల్‌తో చదువు మాన్పించి, కోర్టులో గుమాస్తాగా చేర్పించాడు. కోర్టులో పై సంపాదనకూడా వుంటుందని తనకుచెప్పాడు. నలుగురికీ చెప్పాడు. అంతకంటే ఆయనయేం చేస్తాడు.

## 2

రఘుకేవలంతనకోసం, తనను వెతుక్కుంటూ ఆఫీసుకు వస్తాడని యేనాడూ కలలో కూడా అనుకోలేదు సూర్యం. సూర్యానికి చెప్ప లేనంత ఆశ్చర్యం కలిగింది. ఆ ఆశ్చర్యం లోంచి తేరుకునేప్పటికి అతడికి పది నిముషాలు పట్టింది.రఘు చిన్ననాటి స్నేహితుడు. థర్డ్‌ఫారంనుంచీ స్కూలుఫైనల్‌దాకా కలిసి చదువుకున్నారు. ఒకేక్లాసులో ఒకే డివిజనులో ఒకే బెంచీలో పక్కపక్కన్నే కూచునే వారు.ఆనాలుగేళ్ళూ విడదీయరాని బంధంతో పెనవేసుకపోయినారు. రఘు క్లాసులోవున్న వాళ్ళందరిలోనూ, ధనవంతుని పిల్లవాడైనా, తెలివికలవాడైనా వీళ్ళమధ్య స్నేహానికి యే అడ్డంకూ లేకపోయింది. వీళ్ళింట్లోనో వాళ్ళింట్లోనో ప్రొద్దస్తమానం చదువుకుంటూనో, ఆడుకుంటూనో కాలంగడిపేవాళ్ళు. అలాంటి రఘు స్కూలుఫైనల్‌లో టోటల్‌ఫస్టున వచ్చాడు. పైన వాళ్లు డబ్బుకలవాళ్ళు. రఘుపై చదువులకని కాలేజికి వెళ్ళిపోయాడు.సూర్యం అవాళ నుంచే రఘుయెడలవున్న మమకారాన్ని కొంత కొంత వదల్చుకున్నాడు. రెండు మూడేళ్ళు గడిచేసరికి ఆ స్నేహం వొక స్మృతిగా మాత్రమే మిగిలిపోయింది. రఘు ఇప్పుడు డాక్టర్‌కోర్సు చదువుతున్నాడని

సూర్యానికి తెలుసు.

అలాంటి రఘు యీ ఊరు వచ్చితనని జ్ఞాపకం పెట్టుకుని, తననిగురించి తెలుసుకుని, తనను చూసిపోదామని ఆఫీసుకువచ్చాడు. ఆ తలంపు కలగ్గానే సూర్యానికి శరీరం గగుర్పొడిచింది. చిన్ననాటి ఆ తీయని రోజులన్నీ కళ్ళ ముందు కదిలినట్లుగా అనిపించింది. సూర్యం తేరుకుని మామూలుగా మాట్లాడలేకనే పోయినాడు.

రఘుమాత్రం "ఏరా సూర్యం" అని అతి సహజంగా పలకరించాడు.

మధ్యాహ్నం సెలవు తీసుకుని సూర్యం రఘు వెంట బయటకు వచ్చేశాడు.

సూర్యానికి యెన్నో అడగాలనివుంది. ఎన్నో తెలుసుకోవాలనివుంది. కాని ఒక్కటీ అడగలేకపోతున్నాడు. అడిగినవాటికి సమాధానాలు చెప్పలేకపోతున్నాడు. రఘుతో మాట్లాడుతుంటే సూర్యానికి స్నేహితుడితో మాట్లాడుతున్నట్లుగా లేదు. ఏమిటో పరాయివాడితో మాట్లాడుతున్నట్లుగా వుంది.

సాయంకాలం కాఫీతాగి అలా ఊరిబయటకు వెళ్ళారు. అవన్నీ వాళ్ళకు చిరపరిచిత స్థలాలే. అక్కడ ఆడపిల్లల హైస్కూలు వున్నది. ఆ వేపుకు చిన్నతనంలో వాళ్ళు యెన్నోసార్లు వచ్చారు. ఆగోడ్డున రెండువేపులా వున్న చింతచెట్లమీద చింతకాయలు, చిగురు యెన్నోమార్లు కోసుకున్నారు.

అప్పుడే స్కూలు విడిచిపెట్టినట్లుంది.

అల్లంతా దూరాన చిన్నచెల్లెళ్ళిద్దరూ వస్తున్నారు స్కూలునుంచి.

వాళ్లను పలకరించటం సూర్యానికి బొత్తిగా ఇష్టంలేదు.

పక్కన రఘుకూడా వున్నాడు. నిజానికి వాళ్ళు హాయిగా, అమాయకంగా, చలాకీగానేవున్నా, వాళ్ళేదో దిగులుగా, దీనంగా, లేమితో బాధపడుతున్నవాళ్ళకుమల్లే కన్పించారు సూర్యానికి.

కాని వాళ్ళు తప్పుకుని పోలేదు.

యశోద యెదురుగా నిలుచుని "పదిహేనో తారీక్కల్లా జీతం కట్టకపోతే పేరు కొట్టేస్తారుట అన్నయ్యా" అని చెప్పింది. "ఇప్పటికే తొమ్మిదణాల ఫైను పడిందన్నయ్యా" అన్నది రాధ. సూర్యానికి తల కొట్టేసినంత అవమానమైంది. మనసు ఆర్ద్రమైపోయింది. వాళ్ళకేం తెలుసు. వాళ్ళు చిన్నపిల్లలు. ఇవాళనుంచే వాళ్ళకు యీ బాధలు, యీ బరువులూ యెలా అర్థమవుతవి? అసలు యెందుకు అర్థంకావాలి?

"సరేనులే" అన్నాడు వీలైనంతగా విసుగును గొంతులోనే నొక్కిపట్టుకుంటూ.

"ఒక రెండణాలుంటే ఇవ్వన్నయ్యా, చామంతిపూలు తీసుకపోతాము" అన్నది రాధ.

సూర్యం జేబులోంచి తీసిఇస్తే వాళ్ళు వెళ్ళిపోయారు.

తన జేబులో సమయానికి ఆమాత్రం వుండటం ఇవాళ సూర్యానికి చాలా సంతోషం కలుగజేసింది. ఎన్నిరోజులో నెలలో ఆమాత్రంకూడా తన జేబులో చిల్లరడబ్బులు లేకుండా గడచిపోతుంటవి. తనకా విషయం లెక్కలోనిది కాదు.

వాళ్ళి ఊరికి దూరంగా కూచున్నారు.

వాతావరణమంతా హాయిగావున్నది. పడమటదిక్కున అస్తమించబోతున్న సూర్యబింబమూ, ఎఱ్ఱనిమబ్బులు, దూరాన పంటచేలూ వాళ్ళు కూచున్న చోటునుంచి మనోజ్ఞంగా కనపడుతున్నాయి.

ఉన్నట్లుండి రఘు హటాత్తుగా "మీా

అక్కయ్య పెళ్ళి అయిందా సూర్యం" అని అడిగాడు. సూర్యానికి ఆ ప్రశ్న చాలా అసహజంగా వున్నట్లనిపించింది.

"లేదు" అని చెప్పాడు.

రఘుకి ఆ సమాధానం చాలా అసంతృప్తి కలిగించింది.

తాను ఆ ప్రశ్న వేసినప్పుడు కుటుంబ పరిస్థితులను విడమరచి చెపుతాడు సూర్యం అని ఊహించాడు.

సూర్యానికి మాత్రం రఘు ఆ ప్రశ్న వెయ్యటం అంతగా మనస్కరించలేదు.

రఘు ఇంక సూటిగా విషయంలోకి దిగిపోయాడు.

"నువ్వు యేమీ అనుకోకుండా వుంటే నేనొక విషయం చెపుదామనే ఇంతదూరం వచ్చాను సూర్యం" అన్నాడు రఘు.

"ఇటువంటి విషయం నేను నీకేగాక, ఇక యెవరికీకూడా చెప్పకూడదనుకో. అయినా చెప్పవలసి వస్తున్నది. తప్పటంలేదు. కేవలం స్వార్థమే ననుకో. నిన్నావిషయం అడగటానికి నాకెంతో సిగ్గుగావుంది. చాలా కష్టంగానూవుంది. ఏమంటావు ? చెప్పమంటావా ?'' అన్నాడు.

సూర్యానికి యీ ఉపోద్ఘాతమంతా దేనికో బొత్తిగా అర్థంకాకుండావుంది. పైన రఘు ఇన్నాళ్ళ తరువాత కనపడి తనకేదో రహస్యం చెపుతాననటున్నాడు. రఘు చెప్పేది యేమైవుంటుందో అని అతడి మనస్సు ఔత్సుక్యం చెందింది.

''ఏమిటో చెప్పు" అన్నాడు సూర్యం.

రఘు చాలాసేపు తటాపటాయించాడు. ముఖం పక్కకు తిప్పుకున్నాడు పదిక్షణాల కాలం.

తరువాత అడిగాడు "నీకుగాని ఇప్పట్లో పెండ్లిచేసుకునే ఉద్దేశ్యం వున్నదా ?''

సూర్యం పూర్తిగా హతాశుడై పోయినాడు. రఘు ఇంకా తనను యేమియేమిటి అడుగుతాడో అని వూహిస్తున్నాడు. అతి మామూలు చచ్చుప్రశ్న అడిగాడు రఘు. ఇదివరలో యీ ప్రశ్న చాలామంది తనను అడిగారు. తాను వాళ్ళకు సమాధానం చెప్పలేదు. ఇవాళ రఘుకుమాత్రం యేమని సమాధానం చెపుతాడు. పెండ్లిచేసుకోవాలని తనకున్నమాట వాస్తవమే. అయితే పెండ్లంటే తనకు ఒక రకంగా భయం. పెండ్లిచేసుకున్నందువల్ల సుఖం వుండవచ్చునుగాక. దాంతోపాటే బరువులూ, బాధలూ, దుఃఖంకూడా అనుభవించవలసి వుంటుంది. తనలాంటి మధ్యతరగతి కుటుంబీకుడు వివాహంద్వారా జీవితంలో శాంతిని అభిలషించటానికి వీలుండదు. కేవలం సృష్టి రహస్యంలో నిబిడీకృతమైవున్న ప్రకృతికి సంబంధించిన సుఖాన్నేదో పొందవచ్చును. సంతానం కలుగుతుంది. సంపాదన పెరగదు. చింతా, చికాకూ, యెదుర్కోవాలి. వివాహం చేసుకోవటం అంటే వొక ప్రవాహంలో దూకడంలాంటిది. అవతల వడ్డున బంగారం ముద్దలుముద్దలుగా పడివుందనుకుందాము. ఈ ప్రవాహం దాటగలిగితేనేగదా, ఆ కనకాన్ని పొందగలిగేది. ఈ ప్రవాహాన్ని చాలామంది దాటలేరు. ఈ ప్రయత్నంలో సర్వశక్తులూ వృథాఅవుతవి. ఆ ప్రవాహమార్గాన యెటో కొట్టుకుని పోవలసివుంటుంది. అవతలవొడ్డున కుప్పలూరలుగా పడివున్న కనకాన్ని సుఖమనుకుందాము. వివాహమంటే ప్రవాహ మనుకుందాము. మనుషులందరూ దూకుతారు ఒకరో ఇద్దరో ఆ వొడ్డుకు చేరుతారు. వాళ్ళు చేతికందిన దాన్ని తీసుకోవలసి వుంటుందేకాని, మొత్తా

న్ని యెవ్వరూ పొందలేరు.

"నేను యెందు కడుగుతున్నానా యీ ప్రశ్న అని ఆలోచిస్తున్నావులావుంది. నీ సమాధానం నాకేమైనా ప్రయోజనకారిగా వుంటుందేమోనని ఆశ. అందుకే అడుగుతున్నాను" అన్నాడు రఘు.

"ఏమో, యీ ప్రశ్నకు సమాధానం చెప్పాలని నాకు లేదు" అన్నాడు సూర్యం.

"అలా అంటే నేను చేసేది యేమీ లేదు సూర్యం. నేను చెప్పేవిషయం నీకు చాలా బాధకలిగిస్తుందని నాకూ తెలుసు. అయితే ఇందులో నీ ఇష్టానికి, నీ ఆలోచనకు వ్యతిరేకంగా యెప్పుడూ యేదీ జరగదు. నువ్వు సంపూర్ణంగా ఇష్టపడితేనే, నువ్వు అన్ని విషయాలూ ఆలోచించుకుంటేనే నీ అంగీకారాన్ని తెలియజేయవచ్చును. నేను ఓ కథ చెప్తాను—విను. పూర్తిచేసేసరికి చాలా వరకు నీకే అర్థమవుతుంది" అన్నాడు రఘు.

నాకు ఇద్దరు మేనమామలున్నారు. ఒకరు నీకూ తెలుసు. మేము యీ ఊళ్ళోవున్న నాలుగేళ్ళలో ఆయన రెండు మూడుసార్లు వచ్చాడు. నువ్వు యెప్పుడైనా చూసికూడా వుంటావు. ఒకసారి ఆయనతో మనం సినిమాకుకూడా పోయినట్లు గుర్తు. ఆయనపేరు చక్రధరరావు. ఆయన ఇప్పుడు పోలీస్ సూపరింటెండెంటుగా వుంటున్నారు. ఆయనకు ఒక్కతే కూతురు. ఒక్కడే కొడుకు. ఉద్యోగరీత్యానే కాకుండా అసలు వాళ్ళు చాలా ఆస్తి కలవాళ్ళు. మా రెండో మామయ్య కాలేజీలో లెక్చరర్‌గా వుంటున్నాడు. ఆయనకు ఐదారుగురు పిల్లలున్నారు. పెద్దపిల్ల బి.యస్.సి. చదువుతున్నది. నాలానే యం. బి. చదవాలని ఆపిల్లకుతూహలం. అయితే సీటు రాలేదు. పైన వాళ్ళనాన్న నేను భరించలేనమ్మా. అనికూడా అన్నాట్ట. తక్కినపిల్లలు కూడా కాలేజీలోనూ, స్కూల్లోను చదువుకుంటున్నారు. మా చిన్నమామయ్య పెద్దమామయ్యంత. చెప్పుకోదగిన స్థితిలో లేడు. అయితే అసలు సంగతి చెపతున్నాను. చిన్నమామయ్య పెద్ద కూతురుని చేసుకోవాలని వుందినాకు. అదే ఆ బి. యస్. సి. చదివే పిల్లని. అయితే పెద్ద మామయ్యకూతురూ ఇంటర్ చదువుతోంది ఆయనకొడుకు ఆనర్స్ చదువుతున్నాడు. అసలు విషయం చెపుతున్నాను. పెద్దమామయ్య కూతురు పేరు సరోజ. సరోజకు చిన్నతనాన అంటే నాలుగైదేళ్ళప్పుడు స్ఫోటకంపోసింది. ఒక కన్ను పువ్వుపూసిపోయింది. ముఖాన యే నాలుగైదు మచ్చలోవున్నాయి. చూడు చేతులకో కాళ్ళకో దేనికైనా ఆరువేళ్ళు వుంటే వాళ్లు అదృష్టవంతులవుతారంటారు. దానికలానే వున్నాయి నో చేతికి. అయితే దాని అదృష్టం ఇలావుంది. ఆ వైకల్యం తప్పితే పిల్ల చందనపుబొమ్మలావుంటుంది. నాకు దాన్ని చూస్తే యేడుపొస్తుంది. భగవంతుడెవడైనా వున్నాడనుకుంటే వాడిమీద పరమ అసహ్యం కలుగుతుంది. కళ్ళూ కాళ్ళూ సరిగ్గా వున్న యెంతమందో దానికాలిగోరికికూడా సరిపోరు. అటువంటిది దాన్ని చూసి, దాని విషయం తలచుకుని అంతకరకుగుండె గల పోలీస్ సూపరింటెండెంటుగారూ వలవలా ఏడుస్తారు. నీకొక్కదే కన్ను లేంది. నాకు. భగవంతుడు నాకు రెండు కళ్ళూ ఇచ్చాడు. ఏం లాభం, ఒక కన్ను పనిచెయ్యకుండా చేశాడు. అంటాడాయన ఆఅమ్మాయినితలచుకొని. నిజానికా యిద్దరికే ఆయన సంతానం. అందులో ఆ పిల్ల అలా, వాళ్ళకు యే విషయంలోనూ కొదవలేదు. గుణం విషయం

ఆ పిల్లను చెప్పియెవరికైనా చెప్పాలి. ఎంతో అణకువ కలది. పోషణకు తక్కువలేదు. కాబట్టి ఆ అమ్మాయి బాగానేవుంటుంది. గాగుల్స్ పెట్టుకుని కాలేజీకి వెళుతుంటే, ఆ పిల్లకు ఒక కన్ను లేదని యెవరూ అనుకోరు. దేవ కన్య అనే అనుకుంటారు. అందుకని ఆ అమ్మాయి యెప్పుడూ గాగుల్స్ పెట్టుకునే ఉంటుంది. మామయ్య అంటాడు. నన్ను చేసుకోమంటాడు. "నీకు అన్ని విషయాలూ తెలుసు. నేను యెలాపెంచుకున్నానో తెలుసు. నాకు యెంత ప్రాణమో తెలుసు. నువుదాన్ని సరిగ్గా చూడకపోయినా నాకు బాధలేదు. ఎందుకంటే నీకు నేను పూర్తిగా తెలుసును కాబట్టి." అంటాడు మామయ్య. నిజం చెపుతున్నాను సూర్యం. ఒట్టేసి చెపుతున్నాను. బహుశా నీ మనసున నువు నిజమని నే చెప్పే దాన్ని విశ్వసించకపోవచ్చును. అయినావిను. ఆ పిల్లకు కన్ను లేదని, అంగవైకల్యం వుందనీ కాదు నేనుచేసుకోకపోవటం. మరోలా అర్థం చేసుకోవద్దు. నాకు సరోజఅంటే యెంతో అభిమానం, ఎంతోఇష్టం. అయితే చిన్న మామయ్యకూతురిని నేను వదులు కోలేను. నే నిలా నీదగ్గరకువచ్చి అడగకూడదనుకో. నాకు బుద్ధి లేదనీ, జ్ఞానం లేదనీ నువ్వు అనుకున్నా సరే - నిన్ను మా సరోజను చేసుకోమంటున్నాను. నా విషయం వేరు. మామయ్య నా చేతులు పట్టుకుని కన్నీళ్ళు పెట్టుకున్నాడు. నేను నిలవలేకపోయినాను. ఆయన పాతిక వేల రూపాయలు ఇస్తాడు. తరువాత ఆస్తి చెరిసగం వ్రాస్తానన్నాడు. డబ్బుతో మనుషులనీ, మనసులనీ కొనుక్కోవటం అనుకోకు. ఎటుపోయి యెటువచ్చినా, తండ్రి హృదయం కనుక ఆ అమ్మాయి పేరిట తన సగం ఆస్తి వ్రాసిస్తే ఆఅమ్మాయి భర్తవైపునుండికృత్రిమమైన ఆదరమైనా లభిస్తుంది కదాఅని ఆయన ఆశ. నువ్వేమని ఆలోచిస్తుంటావో నాకు తెలుసు. ఇన్ని చెప్పేవాడవు నువ్వే ఎందుకు చేసుకోకూడదు? అని అనుకుంటావు. కాని నేను చెప్పాను చూడు. మరి "నాకోసం యెందుకు వచ్చాడా" అని నువ్వుఅనుకోవచ్చు. "నువు నాకు బాగా తెలుసుగనుక" ఇందులో నిన్ను మోసగిస్తున్నది యేమీలేదనుకుంటే ఆలోచించు. ఇదిగో ఫుటోపట్టుకొచ్చాను చూడు. ఇందులో నా స్వార్థం యేమైనావుంటుందని అనుమాన పడవద్దు. అలా నువు అనుకుంటే తలపగలగొట్టుకోవటం కన్నా నేనేమీ చెయ్యలేను."

సూర్యానికి రఘు చెప్పినదంతా వినేసరికి తల తిరిగిపోయింది. వచించరాని అవమానానికి తాను గురియైనట్లుగా బాధపడ్డాడు. అతిడి చేతిలోని ఆ ఫుటోని చూసేందుకుకూడాసాహసించ లేకపోయాడు సూర్యం. రఘు తాను చెప్పవలసినదంతా చెప్పటం పూర్తి అయినట్లు లోపల దాచుకున్న యెంతో బరువును వదుల్చుకున్నట్లు వొక్కమాటా మాట్లాడలేకపోయినాడు.

ఊళ్ళోకి వచ్చిందాకా ఒక్కరూ ఒక్క మాటా మాట్లాడలేదు. అప్పటికి చీకటిపడిపోయింది. ఆ ఫుటో చేతికి తీసుకుని జేబులో దాచుకున్నాడు సూర్యం.

"పది పదిహేను రోజుల్లో అన్ని విషయాలూ ఆలోచించుకుని ఉత్తరం వ్రాయి సూర్యం" అన్నాడు రఘు.

అవాళ వుండిపొమ్మన్నాడు సూర్యం.

స్టేషన్లో రైలు కదులుతుండగా "మరోలా అనుకోకు సూర్యం. తప్పక ఉత్తరం వ్రాయి. నన్ను క్షమించు" అంటుంటే రఘు కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

ఆ రఘు కళ్ళలో తమ చిన్ననాటి చెలిమి కన్పించింది సూర్యానికి.

స్టేషన్ ఆవరణదాటి రోడ్డుమీదకొచ్చిన తర్వాత తనకళ్ళు చెమ్మగిల్లటం స్పష్టంగా తెలిసింది సూర్యానికి.

## 3

వారం రోజులు వరసగా నిద్రలేదు సూర్యానికి. ఎప్పుడైనా కన్ను మూతపడితే సన్నాయి వాయిద్యం, ముత్యాల పల్లకీలు, తలంబ్రాలు, కర్పూరపుదండలు. ఏమిటో ఆలాపన. ఐదు పాలకీలు వరుసన, అందులో ఐదుగురూ బంగారుతల్లులు. వాళ్ళు దేవకన్యల్లావున్నారు. వాళ్ళు నవ్వు వెన్నెల కాసినట్లువుంది. వాళ్ళు నవ్వుతుంటే ఆ కళ్యాణపు బొట్లలో ఐదుగురూ లక్ష్మీ అమ్మవార్లలా వున్నారు. ఆఁ చదవండయ్యా మంత్రాలు. వాయించండయ్యా మేళాలు. "మాంగల్య తంతునానేన, మమజీవన హేతునా...... ఎక్కడచూసిన తలంబ్రాలు. పట్టుచీరలు పువ్వులు. నవ్వులు.

చప్పున లేచి కూచునేవాడు. చీకటి కన్ను పొడుచుకున్నా కానరానిచీకటి.

అవతలగదిలో ఐదుగురు ఆడపిల్లలు నిద్ర పోతున్నారు.

పాపం. ఎంతదైన్యమో.

ఏమేమి కలలు కంటున్నారో.

వసారాలో ముసలాయన దగ్గుతున్నాడు.

ముసలామె మంచినీళ్ళిస్తున్న చప్పుడు.

మళ్ళీ ఇంతలో ఆలాపన, ముసలాయన మంచి ప్రేముకుర్చీలో కూర్చునివున్నాడు. ద్వారాలనిండా రంగురంగుల తెరలు, గోడలకు అందమైన ఫుటోలు. ముసలాయన దర్జాగా చుట్ట కాల్చుకుంటున్నాడు. ముసలామె ఫెళఫెళలాడే పట్టుచీర కట్టుకుని ఇంట్లో హడావిడిగా తిరుగుతోంది.

కల కరిగిపోయింది.

మళ్ళీ భయంకరమైన స్వప్నం ఏమిటో తియ్యనైన బాధ ఎవరివో అందమైన, మృదువైన రెండుచేతులు తన మెడచుట్టుకున్నాయి. పరవశత్వం కలుగుతున్నది. ఆ ముఖాన్ని ముద్దుపెట్టుకొని వేళ్లతో సున్నితంగా స్పృశిస్తున్నాడు. అమ్మో వాక కన్ను లేదు. ఆ చేతులు దూరంగా తీసివేశాడు. ఆ ముఖాన్ని దూరంగా నెట్టివేశాడు.

మెళుకువ. పూర్తిమెళుకువ. నిజంగా అందనే కావాలా ? ఈ సృష్టి యెక్కడనుంచి యెక్కడకు పోతున్నది? ఈ ఆకర్షణకు అర్థమేమిటి? ఎన్నియుగాలు ఇలాగడచిపోయాయి! ఎన్ని యుగాలు గడవనున్నాయి ? చరిత్ర ఏమని ఋజువుచేసింది? తత్త్వం యేమని చెపుతున్నది? మిగిలేది యేమీలేదు. మిగిలేది యేమీలేదు అనేనా ?

ఎంతమంది రాజులు ఎన్నెన్ని రాజ్యాలు ఎందరెందరు అందమైన ఆడవాళ్లు ఎంత అవినీతి ? ఎన్ని హత్యలు ? కామం. క్రోధం. ఒక నీరో ఒక అలెగ్జాండరు ఒక టైబీరియస్ ఒక సీజరు ఒక చెంఘిజ్‌కాన్ ఒక గజనీ మహమ్మదు ... ఇంకా ఇంకా, ఎందరో యెందరో? అందమైన ఆడదానికోసం యెన్ని యుద్ధాలు? ఫలాని రాజుగారి పడకగదిలో రాణీగారితో ఒక వీరుడు. ఒక సామాన్యుడు. కత్తి యుద్ధాలు. విషప్రయోగం. ఫలాని రాజుగారు చెరచిన ఆడవాళ్లు. ప్రాణాలు తీసిన ఆడవాళ్ళు. విప్లవం. ద్రోహం, ఘోరం. కామం. ఏమిటీ సృష్టి. ఎన్నెన్ని యుగాలుగా ఇన్నిన్ని దారుణాలు ఎక్కడైనా తృప్తిదొరి

కేనా, అందమైన భార్యతో సుఖంవున్నదా? తృప్తివున్నదా? సుఖంఅంటే యేమిటి? అందమంటే యెలాంటిది. ఎట్లావుంటుంది. ఈ ప్రశ్నలకు సమాధానాలురావు. ఈ అసంతృప్తికి మందు లేదు. ఈ జీవితానికి సుఖం వుండదు. శాంతి వుండదు.

ఉన్నదానితో సరిపెట్టుకోకూడదు అంటారు. మళ్ళీ ఉన్నదానితోనే తృప్తిపడమంటారు. ఏమిటో వున్నదంటారు. ఏమీ లేదంటారు.

ఏంచెయ్యాలి తాను. ఇప్పుడేంచెయ్యాలి— ఏమీ తోచటంలేదు.

సూర్యం వారంరోజుల్లోనే సగమైపోయినాడు. ఏమిటో దుఃఖంగా వుంటుంది మనస్సుకు యెల్లప్పుడు. నిజానికి తను మనిషి. అతి మామూలుమనిషి. మామూలు మనిషికి మామూలు సుఖం కావాలంటే డబ్బు వుండాలి. డబ్బు లేకపోతే యీ ప్రపంచంలో యేపనీ జరుగదు. అందరికీ లోకువే.

కలపకొట్టు యజమాని కొట్టుకు యీడుస్తానంటాడు.

ఇంకో పెద్దమనిషి ఇల్లు వేలం వేయిస్తానంటాడు.

ఇంకోడు ఇంకోటి అంటాడు. వేలావొకటి అంటాడు.

డబ్బు ఉంటే యెవ్వరూ యేమీ అనరు.

డబ్బువుంటే పిల్లలకు పెళ్ళిళ్ళు అవుతవి. పుట్టబోయే పిల్లలకు చదువులూ వస్తవి.

ఇంతకూ అదృష్టం యెలావుంటే అలాజరుగుతుంది. పోనీ తాను వొక మంచి పిల్లనే పెళ్ళి చేసుకుంటాడు. కర్మం చాలకపోతే ఆ అమ్మాయికి తర్వాత వైకల్యం రాకూడదూ?

సూర్యం ఇలా ఆలోచించాడు. మనిషిలోని బలహీనతలు ఇలా ఆలోచింపచేస్తవి. ఎక్కడి కక్కడ సరిపెట్టుకునే మనస్తత్వం ఇలా ఆలోచింపచేస్తుంది. స్వార్థం ఇలా ఆలోచింప చేస్తుంది. వ్యామోహం, దైన్యం, దారిద్ర్యం, ఇలా ఆలోచింప చేస్తాయి.

సూర్యం ఇదివరలో అనుకునేవాడు. ఎవరైనా పెళ్ళిచేసుకుంటావా అని అడిగినప్పుడు కాని, పిల్లనిస్తామని వచ్చినప్పుడుకాని, 'పెళ్ళి చేసుకుంటాను. పెళ్ళిచేసుకుంటే యేమవుతారు గుతుంది. ఈ ఐదుగురు ఆడపిల్లలకు తోడు ఇంకోపిల్ల వస్తుంది. అప్పుడు ఆరుగురు ఆడపిల్లలవుతారు.'

ఇప్పుడు అలాకాదు.

ఇప్పుడు వచ్చేపిల్ల డబ్బు తెస్తుంది. దిగులు పోగొడుతుంది.

ఏం ఒక్క కన్ను లేకపోతే.

సూర్యం ఇంట్లో చెప్పినప్పుడు తల్లియేడ్చింది. తండ్రి మాట్లాడలేదు. పిల్లలు ముఖాలు మాడ్చుకున్నారు.

సూర్యం లెక్కపెట్టలేదు. రోజులు గడిచినకొద్దీ అతనికి చిత్తశాంతి కరవైపోతున్నది. ఏమీ తోచటంలేదు. ఏమిటేమిటో ఆలోచనలు. ఇంట్లో ఒక్క క్షణంకూడా వుండలేకపోతున్నాడు. ఆఫీసులో పనిచేసుకోలేకపోతున్నాడు.

రఘుకి ఒకరోజున ఉత్తరం వ్రాశాడు.

ఆ ఉత్తరం పోస్టుచేసినతర్వాత అతడి బరువు తీసివేసినట్లైంది.

# 4

రాజేశ్వరికి పెండ్లయింది. ఐదువేలు కట్నమిచ్చారు. అన్ని లాంఛనాలూ జరిపించారు. సంబంధం చక్రధరరావుగారే కుదిర్చారు. దగ్గరుండి చేయించారు.

"నువ్వు యీ ఉద్యోగం మానేసి చదువుకోదలచుకుంటే చదువుకో నాయనా" అన్నారు మామగారు.

"నాకు పెద్ద ఇష్టమంటూ యేమీలేదు. మీ యిష్టముండీ" అన్నాడు సూర్యం.

ఆయన నవ్వి వూరుకున్నారు. తర్వాత "అమ్మాయి నడుగు" అన్నారు.

సూర్యం అడిగాడు.

"మీకేం పాతికేళ్ళొచ్చినవా, ముప్ఫయేళ్ళు వచ్చినవా చదువుకోండి" అన్నది సరోజ.

చదువుకుందామనే అనుకున్నాడు సూర్యం.

రాజేశ్వరి భర్తయేదో పండగకువచ్చాడు. రాజేశ్వరి ఇంకా అత్తగారింటికిపోలేదు. ఇల్లంతా యెంతో కళకళలాడుతూవుంది. సంతోషం తాండవిస్తూవుంది.

సరోజకూడా ఇంకా అత్తవారింటికిరాలేదు. సూర్యంకూడా రేపోమాపో అత్తవారిఇంటికి వెళదామనుకుంటున్నాడు. సాయంకాలమైంది లైట్లు వెలిగాయి. సూర్యం బజారునుంచి వచ్చాడు పూలూ, పండ్లూ తీసుకుని. బయట గదిలో బావగారూ, రాజేశ్వరీ యేదో మాటాడుకుంటున్నారు. తనపేరు వచ్చింది. అక్కడనుంచి కదలలేకపోయాడు సూర్యం. బావగారు అంటున్నారు.

"మీ తమ్ముడికి యెంతడబ్బు పైన మన కారమవు తేమటుకు, ఆపిల్ల నెలాచేసుకున్నాడు? పోనీలే బాగా కొట్టేశాడు."

రాజేశ్వరి అంటున్నది.

"అవును. నాకూ అదేఅర్థంకాకుండావుంది. ఎంతడబ్బుఆశ అయితేమటుకు. ఆ కన్నులేని ఆ మచ్చలతో, అసహ్యంగా, ఆ పిల్లను... అని లోకులంతా అనుకుంటున్నారు. అయినా వాడికేమిటనిపించిందో..."

"అయినా పాతికవేలు..."

"అంతా అలానే అనుకుంటున్నారు"

అప్పుడే చంద్రోదయమవుతున్నది.

కాని సూర్యానికి మాత్రం. బయటా, లోపలా, అంతటా, చీకటి. *

# మాతృజన్మదినము

అంచల వోలె ఆకసము నందున ఎఱ్ఱని పైడిఅంచు చే
లాంచలముల్ పరీమళ మహాబ్ధి సుధారస సిక్తలోచనా
బ్జాంచలముల్ – ప్రభాత కిరణాచ్ఛ సరస్సున సుళ్ళువోయెనో?
సంచిత పూర్వ పుణ్యమయ సాధు సహస్రఫల స్వరూపమై.

ఒక తెరతీసినట్లు ఎపుడో ఎపుడో స్మృతి వచ్చుచున్న దా
ఒక అను భూతి, నామనసు ఊహాలు అప్పుడ విచ్చుకొన్నవో
ప్రకృత మనోనులక్షణ విభావముగా అనుభూతకాలమం
దాక కొసగోచరించినది యోగ మహేశ్వరసాధ్య చిత్రమై.

శతశోవిభక్తలిప్త
ప్రతీతి అవికృతము ఎడద పదిలపరుపబ
డ్డ తెరిని జీవపథమునం
దు తడిసిన నవేంద్రచాప తోరణమగుచున్.

తానై యిర్వది మూడు నేండ్లఘను నాధారంబుగా కాలగ
ర్భానన్ చీల్చుకవచ్చి యీ నిమిష దీప్తం బయ్యె ఈ కాలఖం
డానన్ నే పృథివింబడన్ గనిన ఆనందోర్ధ్వకల్లోలమా
లానృత్యాకృతి నారియొక్కతె దృశాలంపాక యైచూచివన్.

అది నాకు జన్మసమయము
అది ఆమెకు మాతృతామహాపదవి, కనుక
తుదల నొకసారి పెలిగెన
విదితము లోకేశ్వరీ పవిత్రతాకృతియై.

ఆ మూపుల్ తలపెత్తి ఆచ్చెరలుగానై జీవ మార్గానలి
ప్రాచైతన్యవిలాస మొప్పగ వియద్భాగమ్ము నా గుండెలో
శ్రీచక్రాకృతి విచ్చుకో సమ్మృతవర్షి స్వచ్ఛనేత్రాంతమై
తోచెన్ దేవి సమస్తసృష్టిగల యింతుల్ బంతులై కొప్పులో

మనసున వెలిగిన దేవి
వినూత్నచూడాహిమాంశువీధులలో వీధులలోనన్
కనులెదుర నిలచు తల్లిని
అనాకులక్ష్మీరసాగరాకృతిగంటిన్.

ఏలిప్తం బడి యిన్ని యేండ్లరిగెనో ఈ లిప్త కాలిప్తకున్
మాలారమ్యము గాగ కన్తుదల రమ్యాంశుల్ ప్రసారమ్ములై
ఏలెన్ తోల్తటి లిప్త నా మనసునం దీలేమ కీ దేవిరూ
పాలన్ భేదము లేదు దేవితలపై బాలేందువే యెక్కుడై.

తల్లికనుల వెలుగుదారులలో సహ
స్రములు దేవి రూపసాధు రేఖ
లామె నవ్వులందు ఆనంద దేవతా
మధుర భావనా ప్రమాణ గతులు.

యువ ఫాల్గుణ కృష్ణనవమి
అవతరించు నా మనస్సు అద్దములోనన్
వివిధోజ్జ్వల మాతృరూప
శివాకృతులు వ్యాపితములు శ్రీ చక్రములై

ఏ మృదులోహ మార్గమున ఈ అని మీలితలోచనాంశుమా
లా మధురాభిరామము, ఇలాతలమున్నభమున్ సువర్ణరుక్
దామ నిబంధమైన అరుదైన తపస్సము దాత్తచేత ఉ
ద్వ్యోమ సురాపగల్ వాలిచెనో ఒకతల్లి దృగంశువీధిలో.

బ్రతుకున కొక్క కొట్టుకొన పండిన తల్లి మనోజ్ఞ మూర్తినే
త్ర తరళమార్గరోచులు సరస్వతులై బ్రతుకెల్ల నిండెనో
శ్రుతుల తుదల్ కనుంగొనని చోటుల నల్లెడ దేవి ఈకొనన్
అతుక వలెన్ తుదల్ బ్రతుకునంతయు తల్లికి పూలమాలగా.

పి. వి. రమణ

# కన్యాశుల్కము ప్రత్యేకత

ఆధునికాంధ్ర నాటకములందు మిక్కిలి ప్రచారమునకు వచ్చినవానిలో కన్యాశుల్కము దొక ప్రత్యేకత. ఇది "శ్రీశ్రీశ్రీ హార్ హైనెస్ ది మహారాజ కుమారికా సాహేబా ఆఫ్ విజయనగరం మహారాణీ ఆఫ్ మాధోగడ్, రీవా, సర్కారువారి భృత్యుడగు" గురజాడ అప్పారావుగారిచే రచింపబడినది. (ఈ మాటలు కన్యాశుల్కముపై అచ్చుగుద్దబడి యున్నవి.) అసలు ఆ నాటక రచనకు కారకు లానంద గజపతిగారు. 'పూర్వ శతాబ్ది చరమార్థమందు కన్యాశుల్క మల్లీ సంఘమును క్షోభ పెట్టుచుండెను. సంఘము దురవస్థకు దురపిల్లి ఆనందగజపతి ఆంగ్ల కవులు స్విఫ్ట్, డ్రైడెన్‌పోప్ మొదలగువారి సంఘదౌరాత్మ్యాధిక్షేపగర్భితమగు సోపహాస వాఙ్మయరచనలనుపోలు దృశ్యకావ్యము నొకదానిని రచింప అప్పారాయని కాజ్ఞాపించెను.'' * సంఘములో పాతుకొనిపోయిన దురాచారముల నిర్మూలనకు వీరేశలింగము గారు విశేషముగ కృషి సాగించుచున్న రోజులవి. వారి ఉద్యమముచే ప్రభావితులైన గురజాడవారికి ఆనంద గజపతిగారి ఆజ్ఞ దోహద మొనర్చినది. అది రాజాజ్ఞ. వీరి సంస్కార దృష్టికి వీరేశలింగముగారును, సంస్కార దృష్టితోపాటు రచనా ప్రరోచనకు ఆనంద గజపతిగారును కారణభూతులైరి. అట్టి ఈ కన్యాశుల్కముప్రత్యేకతలను పలువురు శ్లాఘించిరి. ఆ ప్రత్యేకత లేవియనగా చిత్తగింపుడు.

ప్రథమ ప్రత్యేకత వాడుకభాషలో రచన సాగించుట. రెండవది సమకాలీన సాంఘిక సమస్యను గ్రహించి నాటకరూపమున రచించుట. అందును పూర్వగాథకు నేటిసమస్య నంటగట్టి రచించుటకాక స్వతంత్రేతివృత్తమును నిర్మించుకొనుట. మూడవది పాత్రోచిత భాష. నాలుగు హాస్యప్రాధాన్యము. అయిదు వచనప్రచురముగ నాటకరచన. ఈ అయిదు ప్రత్యేకతలుకలసి ప్రథమమున నిందే పొడచూపినవని పెక్కురి భావన.

ఆధునిక కవికావ్యము పరామర్శించునపుడు పూర్వవాఙ్మయపరిజ్ఞానలోపమువలన నా కవి ప్రదర్శించిన సకలము నా కవి కలము నుండియే సరిక్రొత్తగనవతరించినదనిభావించు నవ్యవిమర్శక మహానుభావు లెందరో గలరు. వారిదొక అజ్ఞతాప్రపంచము. ఉదాహరణకు గద్యపద్య మధ్యస్థమగు నొకరచనా విన్యాసము వచనపద్య మనుపేర నేటివల చలామణీ యగుచున్నట్టిది అభ్యుదయకవ్యుపజ్ఞమని కొంద రాధునికుల విశ్వాసము. కాని యట్టిది పదునారవ శతాబ్దియందే తాళ్లపాక పెదతిరుమలాచార్యుల వైరాగ్య వచనమాలికాగీతములలోను, కృష్ణమాచార్యుని సింహాగిరి నరహరి వచనములందును, శంకరకవి భవానీమనోహరవచనములం

---

* శ్రీ మే. వ. నరసింహస్వామిగారి 'గురుజాడ అప్పారాయకవి' అనువ్యాసము నుండి విశాలవీణ 1—12—1959.

దును స్పష్టరేఖలతో బాహిరిల్లినది. ముత్యాలసరములందలి 'ఛందస్సు గురజాడవారి మేథనుండి పుట్టుకొనివచ్చెనని యనువారు లేకపోలేదు. అది అచ్చుమచ్చు 'వృషభగతి రగడ.' పూర్వకవులచే సానలుదీరిన జాతిరత్నము. ఉదాహరణకావ్యములలో రగడకు ప్రముఖస్థానము. యక్షగానములలో నిదియే (వృషభగతి రగడ) త్రిపుటగా వ్యవహృతమైనది. లక్షణగ్రంథములందును అది ప్రత్యక్షమయినది. అనంతుని ఛందోదర్పణము మొదలు అనేకాంధ్ర లక్షణగ్రంథములందు దాని లక్షణము పేర్కొనబడుచు వచ్చినది. గురజాడవారును ఆ రగడ ప్రభేదమునే గ్రహించినను దాని ప్రయోజనాధిక్యము నిరూపించి ప్రచారము కలుగజేసి పూర్వ వృషభగతి రగడను మరపించినారు.

కాని ఒక్క విషయము చెప్పకతప్పదు. వీరిద్వారా ఆ రగడకు రాపిడి ఎక్కువైనది. పదిమంది నోళ్లలో పడినది. దీనినే కన్నడమునను 'భామినీ షట్పది' అని యందురు. అది యందు బహుళ ప్రచారమందినది. నాగవర్మ ఛందోంబుధిలో దాని లక్షణముట్టంకితమైనది. అది తెలియకయే ముత్యాలసరములందు ఆ ఛందస్సు గురజాడవారి ప్రతిభకు ఫలమనుట.

అప్పారావుగారును పూర్వాశ్రమమున ప్రాచీనపు బాణీలో సుభద్రా పరిణయమను ప్రబంధమును రచించినారు. ఆ రచన చప్పగా చచ్చుగా నున్నది. పేరునకు ప్రబంధమేగాని ప్రకృష్టత కొరవడినది. దానితో నవ్యతనాశ్రయించినారు.

కన్యాశుల్కము ప్రత్యేకతల ప్రశంసించుటకు పూర్వము అతిపూర్వవాఙ్మయ పరామర్శచేసిన గురజాడవారికి న్యాయము చేకూర్చినవార మగుదుము. అప్పుడేవారి నూత్న విషయ వ్యక్తీకరణ స్పష్టపడును.

వారి గ్రంథ ప్రత్యేకతలలో ప్రముఖమైనది సమకాలిక సాంఘిక సమస్యా సాక్షాత్కృతి యనికదా మనవారిమాట. నాడు వేళ్లు తన్నియున్న కన్యాశుల్క సమస్య, వితంతు వివాహనిషేధము వీరి నాటకమునకు బీజావాప్తిని కలిగించినవి. వరశుల్క వీరత్వము విజృంభించిన నేడు కన్యాశుల్కపు గొడవయే లేదు. అది నాటిసమస్య. ఇటులనే కన్యాశుల్క విషయమును చిత్రించిన నాటకము వారికి పూర్వమే రచితమైన దొకటి కలదు. అది అప్పారావుగారికంటె పెద్దలు, ఆయనకు సమకాలికులు నయిన డబీరు కృష్ణమూర్తిసూరిగారి 'సుభద్రా పరిణయము.' అముద్రిత గ్రంథము. దాని రచనాకాలము కవి సూచించినట్లు విజయనామ సంవత్సరము క్రీ. శ. 1893. కన్యాశుల్క నాటక ప్రథమావతరణము క్రీ. శ. 1897. డబీరువారి నివాసస్థలమును అప్పారావుగారి వాసస్థలమునకు సమీపముననేయున్న ముఖలింగము. వారి కృతులన్నియు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున మూలుగుచున్నవి. డబీరు కృష్ణమూర్తి సూరిగారు 'వివిధ కళాశాలి' 'వేదపండితుడు' నైన ఉద్దండుడు. అట్లని పరమ ఛాందసుడుగాడు. ఉత్తమసంస్కారముగల ఆ పండిత కవిలో సంఘ సంస్కరణాభిలాషయు పొడసూపినది. వీరేశలింగముగారి సంఘసంస్కరణోద్యమము వీరిని ప్రభావితులను జేసినది. వారి కృతియగు దేవదత్త చరిత్ర అవతారికలో వీరేశలింగము మొ॥ ప్రముఖులనుగూడ స్తుతించినారు. సూరిగారి సంఘసంస్కరణ దృష్టి అటు 'సుభద్రా పరిణయమున' కన్యాశుల్కముపై ప్రసరింపగా నిటు 'విధవా వివాహ ప్రోత్సాహ సీసమాలిక'

(నామాంతరము లోకోపకార సీసమాలిక)లో వితంతు వివాహములమీదను ప్రసరించినది. అందు "విధవా వివాహ నిషేధమువలనవచ్చు ననర్థముల బేర్కొనుచు విధవా వివాహ సిద్ధాంత విముఖుల నధిక్షేపించుచు తుదను గాన విధవలెల్ల గల్యాణపాత్రలు మారుపెండ్లి సేయ మానితంబు'అని తీర్మానించును కవి. * అని విధవా వివాహము నిషేధించినవారి కాతఁడు శాపనార్థములు గట్టిగా పెట్టినాడు. ఇక సుభద్రాపరిణయమున కన్యాశుల్క సమస్యవిశేషముగ చర్చింపబడినది. వారి కృతులపై నొకచక్కని సమీక్ష రచించిన డాక్టర్ శ్రీ యస్వీ జోగారావుగారీ గ్రంథమును గూర్చి యిట్లు తెలియజేసిరి.

"సూత్రధారుడు మారిషుని బిలిచి నాటకమాడుటకు లోకోపకారింబని యెంచుట కెడమిచ్చునట్టి యొకకథను దెలుపుమనును మారిషుడు కన్యావిక్రయాచారము నధిక్షేపించుచు బలరాముడు దుర్యోధనుని భాగ్యముచూచి బలాత్కారముగ సుభద్ర నాతని కిచ్చుటకు సంకల్పింపగా శ్రీకృష్ణుడా సంబంధమును దప్పించి అనురూపవరు డర్జునునకిచ్చి యామె కామిత మీడేర్చిన కథ ప్రదర్శించినచో 'కన్యలను దగిన వరులకిచ్చుటకు సత్ప్రోత్సాహము కలుగునననును"

అప్పారావుగారు చిత్రించిన కరటకశాస్త్రిలు మధురవాణుల లక్షణములిందు శ్రీకృష్ణునిలో మూర్తీభవించినవి. ఇక సుభద్ర మన సుబ్బి. దుర్యోధనుడు మన లుబ్ధావధాని. బలరాముడు అపర అగ్నిహోత్రావధానులు. ఆ ధనప్రీతి బలరామునియందు జక్కగనిరూపింపబడినది. ఇంతేగాక "విదూషకునిందొక కన్యాశుల్క పరాయణునిగా జిత్రించినాడు కవి.

ఉదా॥ "విదూషకుడు ఠీవిగా నడచుచు ప్రవేశించును.

సూత్రధారుడు:- నీ వేల నీ ప్రకారము నడచుచున్నావు! ఏపాటి భాగ్యవంతుడవు ?

విదూషకుడు:- నాకేమి లక్ష్యమూ పది మంది కూతుళ్లూ!... ఒక్కొక్క పిల్లను ఆరేసి వందలకు (అప్పటి రేటు) తక్కువ యివ్వను. నలభై సంవత్సరములకంటె ఎంత యెక్కువ వయసుకలిగితే వరునిమీద అన్ని వందలున్నూ, ఎనిమిదికన్నా ఎన్ని సంవత్సరములు ఎక్కువ అయితే అన్నివందలు చిన్నదానిమీద నున్ను వేసి ఆ సొమ్మంతా వరుని వల్లనే పుచ్చుకొంటాను." ♦

అని విశేషించి కన్యాశుల్క ప్రసక్తి చేసినారు కవి. గురజాడవారి 'కన్యాశుల్కము'లో లేని ప్రత్యేకత నాటి కన్యాశుల్కపు రేట్లను గూడ పేర్కొనుట. అది సూరిగారి సంస్కరణ పరాయణతకు పెట్టినపట్టము. అంతమాత్రమేకాక నాటి కన్యాశుల్కపు కక్కుర్తిని 'కన్యాశుల్కము' సలేని యొడుపుతో విమర్శించినారు.

---

* డాక్టర్ శ్రీ యస్వీ. జోగారావుగారి "డబీరు కృష్ణమూర్తి సూరికృతులు" అను వ్యాసము త్రిలిఙ్గ పత్రిక 27 - 12 - 54 అండ్ 3 - 1 - 55.

♦ చూ. 'త్రిలిఙ్గ' పత్రిక 27-1 -54 అండ్ 3-1-55 డాక్టర్ శ్రీ యస్వీ. జోగారావుగారి 'డబీరు కృష్ణమూర్తి సూరి కృతులు' అను వ్యాసమునుండి.

ఆరేసి వందల రూపాయల కాడుపిల్లల నమ్ముకొన మరగిన విదూషకునితో

"సూ॥ ధా॥ అలాగు ఆడపిల్లను అమ్ముకో వచ్చునని శాస్త్రము ఉన్నదా ?

విదూ॥ ఆహా లేక యేమీ – ప్రతిసంగతికి శాస్త్రము ఉండనేయున్నది. (అని గట్టిగా పొడుము పీల్చి చిటికె గొట్టును)

సూ॥ గర్భిణీస్త్రీని కన్యాదానము చేయవచ్చునా?

విదూ॥ ఆహా చేయకేమి ! సాలగ్రామంతో సంపుటం। సంపుటమునందుంచి నాల గ్రామదానము చేసితే యెంతపుణ్యమో అలాగే.

సూ॥ బాగావున్నది. పిల్లతల్లి కన్యాదానము చేయవచ్చునా ?

విదూ॥ ఆహా చేయకేమి ? వత్సం గోవు దానంచా దూడతో గోదానంచేస్తే యెంతో పుణ్యం కదా.

సూ॥ ఓహో బాగా చదువుకున్నావు చాలును..." *

ఇంత పటువుగా నా సమస్యను చర్చించినను గురజాడవారి కన్యాశుల్కమునకువచ్చిన ప్రతిష్ఠరాలేదు. అది 'కన్యాశుల్కము' అదృష్టము. అదిగాక సూరిగారు గ్రహించిన యితివృత్తము పౌరాణికము. అది అభినవాభిరుచులకు గొంత గిట్టనిదనియే యనవలయును. అప్పారావుగారి అదృష్టమునండి వారిదృష్టిలో నొక స్వతంత్రేతివృత్తము మెదిలి అందలి పాత్రలును సాంఘికములే యైనవి. ఆ ప్రత్యేకతను మన మంగీకరింపవచ్చునుగాని అట్టి రచనమెన్నడో ఒక పూర్వకవి మెదడులో మెదలినది. అది ౩00 అక్షరాలా మూడు వందల వత్సరముల క్రిందిమాట. తంజాపురాంధ్రనాయకరాజగు విజయరాఘవుని పరిపాలనాకాలము. ఆతని ఆస్థానకవి పురుషోత్తమ దీక్షితుడు నాడు తంజావూరులో 'సోమరిపోతుల సత్రమను' సమజ్ఞను గుత్తికుగొన్న అన్నదాన సత్రమును గూర్చి "తంజాపురాన్నదాన మహానాటకము" పేర నొక యక్షగానము రచించినాడు. ఆ గ్రంథరచనా కాలము క్రీ. శ. 1669 వ సంవత్సరము. అందా సత్రములో తిష్టవేయుటకువచ్చిన బ్రాహ్మణ బ్రువుల విపరీతచేష్టలు వర్ణితములైనవి.

ఒకరాజ సత్రమునం బెత్తనదారుల వ్యవహారము 'సత్రము భోజనము మఠము నిద్రగా గాలక్షేపముసేయు సోమరి యతిథుల యలస ప్రవర్తనము వీధిగాయకులు మొదలగువారు సంభావనలకి సత్రముల కెగబడుట ♦ అను సాంఘిక పరిస్థితులను గ్రహించి రచించినాడు. కన్యాశుల్కమువలె తాత్కాలికేతి వృత్త సంపృక్తమైనను దక్షిణాంధ్రయుగ విశిష్టతలను గట్టిగా పట్టించుకొనిన రచనమది. ఇది కన్యాశుల్కమువలెనే స్వతంత్రేతి వృత్తము గలరచన. దీని యీ ప్రత్యేకత తెలిసినవారు కన్యాశుల్కము నీ దృష్టితో ప్రథమ ప్రయ

* "సుభద్రా పరిణయము" మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార ప్రతి. ఆర్. నెం. 1171 డి.

♦ పురుషోత్తమ దీక్షితుని "తంజాపురాన్నదాన మహానాటకము" అను వ్యాసమునుండి – ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము 18–9–1955. వ్యాసకర్త డాక్టర్ శ్రీ యస్వీ. జోగారావుగారు.

త్న మని ప్రశంసింప నడుముకట్టిన నది గురజాడ కు నిజముగ నన్యాయమే. అపరిమిత సాహ సమే.

రెండవ ప్రత్యేకత వాడుక భాషలో రచన. గిడుగు సీతాపతిగారు

'వాడుక భాషలో రసవంతంగా కావ్య రచన, కథారచన నాటకరచన సాగింప వచ్చును, సాగించగలము అని చెప్పిచేసి చూపించారు.'

అని ప్రశంసించినారు. నిజమే. అట్టి రచన కన్యాశుల్కములోకూడ విశేషముగ కన్పడుట సత్యము. అట్లుచేసి చూపించని పూర్వులుగలరు. వారి కృతులలోను ఇట్టి రచన కన్పడు చుండుట కన్యాశుల్కమునకే అట్టి రచన ప్రథమమున ప్రదర్శితముకాదు అనుట స్పష్టము. 'తంజాపురాన్నదాన మహానాటక మున' నాటివాడుక భాషకలదు.

ఉదా॥ మహామేలయ్యా; ఎండనక; వాననక, మంచనక, మాలనక, మహావస్తిరయ్యా గ్రాం వేళయితే విసచేముగాని అటుగూర్చుం డుండ"

ఇట్టి రచన మీ ఒక్కదానిలోనేగాదు. నాడు వెలసిన యక్షగానములు పెక్కింటిలో కన్పట్టును. సూరిగారి సుభద్రాపరిణయము నందును 'వచనములలో వ్యావహారికధోరణి కొంతసాగినది." *

కన్యాశుల్కమునకు బూర్వమే వెలసిన గ్రంథములలో వ్యావహారికభాష వ్యాప్తముగ వాడబడినదనుట స్పష్టము. ఈ వ్యావహారిక భాషాప్రయోగము దక్షిణాంధ్ర యుగమున ప్రబలినను వారు నేటివారివలె బరితెగించిన వారుకారు. ప్రయోజనాపేక్షితయా ప్రయోగించిరి. తెనుగుదనమును సాధించుటకువారును వీరగ్రాంథిక శృంఖలముల బింకము సడలించినవారే. కన్యాశుల్కము ప్రత్యేకతలన్నియు నాటికృతులలో కన్పించుచున్నను నొక్కచోట తంజాపురాన్నదానమహానాటకము నన్నొక్కనినవి.

ఇక కన్యాశుల్కము యొక్క మూడవ ప్రత్యేకత పాత్రోచిత భాష. పాత్రస్వభావమునకు సంస్కారమునకుదగిన భాషకన్యాశుల్కములో ప్రయోగింపబడినదనుట నిజమే. కాని పాత్రోచితభాషపై రెండుకావ్యములందును దృష్టము. తంజాపురాన్నదాన మహానాటకములో వివిధభాషలు మాట్లాడువారు ప్రవేశింతురు. నాటి తంజాపురవ్యవహారమున మిళితమైన తమిళపద్యములతోడనే నాటివారి వ్యవహారము పాత్రకుచితముగ ప్రయోగింప బడినదందులో. రెండు భాషలు నేర్చినవాడు ఆయాభాషలు తెలిసిన వారితో వారి భాషలలోనే మాట్లాడును.

సత్రాధికారి కణకపిళ్ళె (తమిళుడు)

'వాసం గారుం! తినుముల కొళంది యా పిళ్ళె - పోనీమాసత్తు నిలవయిుం పేరివయిల్లె. ఇందమాసత్తుక్కణ కుడవహా యిల్లిప్పడి యెత్తోహాక్కండు యెళిదయిల్లె..."అని సంభాషించినాడు. అతడే సుద్దివాండ్లతో

'మనవేలిసవారు బ్రహ్మణ్యప్రభావులు వీరవైష్ణవ సార్వభౌములు అయిగనుక బ్రాహ్మణులకు అన్నపానాదుల పట్ల కొదవవచ్చెనా తాళరు"

* శ్రీ యస్వీ. జోగారావుగారు.

ఇత్యాదిగా ప్రసంగించినాడు. బ్రాహ్మణు డైన పప్పుతిప్పాభట్లు ప్రసంగము అగ్రహార బ్రాహ్మణుల వ్యవహారమును బోలినది.

'సెంగసాని అమనంగా అమంట కాదీషా'

వానికి తగినట్లుగనే సెంగసాని

'నన్నమనేది ! మీా యింటి ఆపెనే అమం దువు.'

ఇట్టి 'అమ' ప్రయోగమే గురజాడవారును అగ్రహార బ్రాహ్మణుల పరముగ ప్రయోగించినారు. డబీరువారి 'సుభద్రాపరిణయము' నను పాత్రోచిత భాషప్రయోగింప బడినది. వికటకవాపుడను హాస్యపాత్ర

'ఓహో హోహో, ఏమివింత......నేను మహావ్రతములు చేసినాను. ఒక సంసారిని నమ్మించినాను. వానిసొమ్ము నపహరించి నాను. వాడు నామీాద దావా తెచ్చినాడు. ఆ దావా నేను గెలిస్తే సత్యనారాయణ వ్రతము చేస్తానని మ్రొక్కుచేసినాను. అది యేలాగు నున్నదో యది ఆలాగేయున్నది"

అని ప్రసంగించును.

ఇక విశేషించి కన్యాశుల్కమునకు 'హాస్య ప్రాధాన్యము తెచ్చినపేరు దొడ్డది. అందు వివిధముగ హాస్యము ప్రదర్శింప బడినదను మాట సత్యము. అర్థముగాని హాస్యముసైత మందున్నదన్న విశేషము కాదామరి !

విశేష ప్రజకర్థముగానిది, కొందరకు మాత్రమే అర్థము కానిది, చాల మందికి అర్థమగునది మొదలుగా నందలి హాస్యమును విభజింపవచ్చును.

పురుషోత్తమ దీక్షితుడును తన గ్రంథమును 'శృంగార హాస్యాద్భుత రసప్రధానంబుగా వ్యవహరించిన తంజాపురాన్నదాన మహానాటకము' అని అనినాడు. అసలది ప్రహసన ప్రాయరచన. కన్యాశుల్కమును ఒక ప్రహసనమని యనవచ్చును. ఇట్టి సాంఘిక సంస్కరణా పరాయణ మగు గ్రంథములలో హాస్యము సాధించినంత ప్రయోజనమితర రసములు సాధింపలేవు. శృంగారప్రధానరచన మని యనినాడేగాని దానికిందు 'రసస్థితిలేదు.

ఇక అద్భుతము గ్రంథమున నున్నదనుట ఒక అద్భుతమే. రసవిషయమున చమత్కారావహ హాస్యమే ప్రధానమనవచ్చును. ఇందలి హాస్యమున కాలంబనము పప్పుతిప్పాభట్లు - భోగాలవారితో నాతని ప్రసంగములు హాస్యరస నిర్భరములు. ఇందొక హాస్యగాని పాత్రయునున్నది.

'సుభద్రా పరిణయము' నందును వికటకవాపుడను హాస్యపాత్ర పాత్రేతర వాక్యము లపైవ్యాఖ్యానము చేయుటయుగలదు.ఇందలిది సున్నితమైన హాస్యము

వచన ప్రాచుర్యముతో నాటక ద్వారమున వెలసిన వానిలో కన్యాశుల్కముదే కావ్యాను సారముగ ప్రథమపీఠమనువారికి 'తంజాపురాన్నదానమహా నాటకము' 'సుభద్రాపరిణయము'ల పరిజ్ఞానలోపమింతేని కలదన వచ్చును. సందేహము లేదు. వానిలో సంభాషణలకు వచనమెక్కువగ వాడబడినది.

కన్యాశుల్క ప్రత్యేకతలుగా గణింపబడుచున్న వ్యావహారికభాషాప్రాధాన్యము. సంఘసంస్కరణపరాయణత పాత్రోచితభాష, హాస్యప్రాధాన్యము, వచన ప్రాచుర్యముగల రచన - ఈ అయిదును పూర్వకావ్యములగు 'తంజాపురాన్నదాన మహానాటకము 'నను' సుభద్రాపరిణయము నను ఒక్కచోట నెక్కొని యున్నవి.

మరి కన్యాశుల్కము మహాకావ్యమైనచో 'వరవిక్రయ'మేల మహాకావ్యము కారాదు ?

అసలు లోకములోనున్న చచ్చుకవులు చాల మందినుండి ఒకపాటి విదగ్ధకవులను పృథక్కరించుటకీ మహాకవి యనుమాట యొక మాటవరుసగా వాడబడుచున్నట్లు తోచును. 'గతానుగతికోలోకో నలోకః పారమార్థికః' మనము నిజముగా నీ మాట నే దృష్టితో వాల్మీకి వ్యాసకాళిదాసాదుల, షేక్స్పియర్ ప్రభృతుల పరముగా ప్రయోగించుచున్నామో ఆ దృష్టితోనే ఈ సందర్భమునను వాడుచున్నామా యని గురజాడ గురించి మహాకవియని భజన చేయువారు ఆత్మశోధన కుపక్రమింతురు గాక అని యాశించుచు సవినయముగా నీ విషయమును మనవిచేయుచున్నాను.

కడమ ప్రత్యేకతలమాట అటుండ సాహిత్యవిషయమున ప్రథమగణ్యములు గ్రంథనామసార్థకత తత్ప్రక్రియా సలక్షణత. గ్రంథనామము కన్యాశుల్కము. గ్రంథమున నీ సమస్యతోపాటు సమానమును ఇతోధికమును అయిన ప్రతిపత్తిగల విషయము లనేకము కలగాపులగముగాచేరి కావ్య పరమార్థము నతకరించినవి. ఇక అది నాటకమట. అవును అది బహుపాత్ర సంభాషణాబంధురమే. అయితే సంవాదమే కాదు నాటక స్వరూపమును నిరూపింపగ లట్టిది. మరి నిబిడశిల్పమగు వస్తుసన్నివేశము. ఆ సంవాదములా సన్నివేశములనుండి దూసుకొనివచ్చి ప్రధానకావ్యప్రయోజనమున కున్ముఖముగ సాగిపోవలెను. ఆ సంవిధాన చాతుర్యమిందాక మృగతృష్ణ.

కన్యాశుల్కము మహాకావ్యము కాకపోయినను ఈయన వ్రాసిన మహాకావ్యము మఱియొండెద్దియు లేకపోయినను మందిమద్దతు వలన మాట పడిపోయినాడు మహానుభావుడు. కాలమహిమ !

# ఉత్తర హరివంశము-సంవిధాన శిల్పము

సంపత్కుమార

మహాకవి అన్నపదం, అతిగా వాడడం జరుగుతూఉంది. ఆ విధంగానే నాచన సోమనాథుని విషయంలోకూడా ఉపయోగించడమవుతూఉన్నది. నాచనసోమనాథుడు ఉత్తమ కవి.

ఉత్తమకవి వేరు, మహాకవివేరు. మహాకావ్యం వ్రాసిన కవిమాత్రమే మహాకవి అవుతాడు. కవిత్వం ఉత్తమంగా వ్రాసినకవి ఉత్తమకవి అవుతాడు. మహాకవి తప్పక ఉత్తమకవి అవుతాడు. కాని ప్రతి ఉత్తమ కవీ మహాకవికాడు. ఉత్తమమైన కవితా శక్తిమాత్రమే ఉత్తమకవిని తయారుచేస్తుంది. మహాకావ్య నిర్మాణానికి ఒక్క కవితా శక్తి మాత్రమే చాలదు. కథాసంవిధానం, రస పోషణ మొదలయిన లక్షవిషయాలు ఆ మహాకావ్య నిర్మాణానికి అవసరమవుతాయి. ఏది లోపించినా, మొత్తానికి ఆఘాతం కలుగుతుంది. ఈ విధంగా ఇద్దరిలోఉండే తారతమ్యాన్ని సరిగా గుర్తించక, ఒకరిని మరొకరుగా, మరొకరిని ఒకరుగా భ్రాంతిపడుతూ ఏకమొత్తంగా మహాకవిపదం ఉపయోగించడం జరుగుతున్నది. నన్నయ తిక్కనాదులు మహాకవులు. నన్నెచోడ నాచనసోమనాథాదులు ఉత్తమకవులు.

నాచనసోముడు వ్రాసిన గ్రంథం, ఉత్తర హరివంశం ఒక్కటే మనకు లభ్యమవుతూ ఉంది. ఆయన వ్రాసాడని మరికొన్నింటిపేర్లు అక్కడక్కడ లక్షణ గ్రంథాలలో ఒకటి రెండు పద్యాలతోసహా కనిపించినా, గ్రంథాలు మాత్రం ఇంతవరకు లభ్యంకాలేదు. అందుకని నాచన సోముని రచనాశక్తినిగూర్చి తెలుసుకోవడానికి ఉత్తర హరివంశం ఒక్కటే మనకు ఆధారం అవుతున్నది.

హరివంశం భారతసంహిత శేషంఅంటారు. హరివంశంపురాణం. అది పూర్వోత్తర భాగాలుగా ఉంది. కవిత్రయంలోని ఎఱ్ఱన దాన్ని సంపూర్ణంగా తెలుగువారికి అందించాడు. నాచన సోముడు పూర్వభాగాన్నివదిలి ఉత్తర భాగాన్నిమాత్రమే ఉత్తరహరివంశంగా రచించాడు. నాచన సోముడు పూర్వభాగాన్ని కూడా రచించాడనే వాదం ఉంది. కాని ఉత్తర హరివంశం ఆశ్వాసాంతగద్యల్లో... సోమనాథ ప్రణీతంబైన ఉత్తర హరివంశంబునందు "ప్రథమాశ్వాసము" ఇత్యాదిగాఉంది. హరివంశం పూర్వభాగంకూడా ఆయన రచించినట్టయితే ఎఱ్ఱనగారి గద్యల్లోలాగా హరివంశము ఉత్తరభాగంబు ప్రథమాశ్వాసము ఇత్యాదిగా ఉండవలసింది. కాబట్టి నాచన సోముడు ఉత్తరభాగాన్నే స్వీకరించాడనేది నిజమవుతున్నది. అందునా కొన్నికొన్ని కథలను విడిచిపెట్టి తన రచనకు అనుగుణంగా ఉంటాయనుకొన్న వాటినే గ్రహించాడు. ఆ కథలతో ఉత్తరహరివంశకావ్యరచన చేశాడు.

మూల హరివంశం పురాణం. పురాణ రచనా మార్గానికీ, కావ్యరచనా మార్గానికీ భేదముంది. ఒక్కొక్క పురాణం ఒక్కొక్క విధంగా పరమేశ్వర మహిమాభి వర్ణనం చేస్తూ ఉంటుంది. అనేక కథలు పురాణాల్లో ఉంటుంటాయి. ఒక్కొక్కప్పుడు ఈ కథ

లన్నిటికీ పరస్పరసంబంధం ఉన్నట్టే గోచరించదు. ఏవిధంగానో ఒకవిధంగా పరమేశ్వర మహిమను వ్యక్తీకరించడమే ముఖ్యంగాని, కథల పరస్పరం సంబంధం ముఖ్యంకాదు. ఆ కథల్లోనూ అవాంతర కథలుకూడా అనేకంగా ఉంటాయి. కాని మొత్తంమీద పరమేశ్వర శక్తిని, మహిమను, తత్వాన్నిగూర్చిన బోధ మాత్రం తప్పక ఉంటుంది. పురాణకర్త యొక్క దృష్టి, కావ్యకర్తదృష్టివలె కాకుండా కేవలం మహిమాదుల వ్యక్తీకరణంపైన్నే కేంద్రీకరించబడి ఉంటుంది. అందుకని పురాణకర్త, కావ్యకర్త భిన్నభిన్న మార్గాల్లో వెళ్లేవాళ్ళవుతారు.

మరి కావ్యం అనేప్పటికి కావ్యానికి సంబంధించిన లక్షణవిషయాలు వచ్చిపడుతాయి. ముఖ్యంగా కావ్యంలో ఏకవాక్యత ఉండడం అవసరమవుతుంది. ఏకరస ప్రాధాన్యం ఉండవలసిఉంటుంది. ప్రధానరసానికి మిగతా రసాలన్నీ అంగభూతంగానే ఉండి ప్రధాన రసాన్ని భంజించకుండా ఉండవలసి ఉంటుంది. కథా సంవిధానంలోని నేర్పూ, వివిధ కవితా శిల్పాలూ తదనుగుణంగానే ఉండవలసి ఉంటుంది. వీటన్నింటి సమాహారంవల్ల కావ్యం సుగ్రథిత మవుతుంది. పురాణాల్లో వీటి ప్రసక్తే ఉండకూడదని కాదుకాని, అక్కడ వీటికి ప్రాధాన్యంఉండదు. కాని కావ్యంలో వీటిల్లో ఏది చెడిపోయినా, మొత్తం లోపంగానే తయారవుతుంది. అందుకని వీటన్నింటి విషయంలో కావ్యకర్త జాగ్రత్త వహించవలసి ఉంటుంది.

సోముడు తన ఉత్తర హరివంశాన్ని పురాణంగా కాక కావ్యంగా నిబంధించ దలచుకొన్నాడు. తన కావ్యాదిలో బలరామ పరాక్రమాభి వర్ణనం అయిదుపద్యాల్లో పూర్తిచేసి "హలపాణి మహిమ చెప్పంగలవారెవ్వరు పురాణ కథలన్ మఱియుం దెలియము" అని వైశంపాయనుడు జనమేజయునితో అన్నట్టుగా ఒక పద్యంఉంది. ఉత్తర హరివంశాన్ని కావ్యంగా నిబంధించ తలచాడు కాబట్టే, నాచనసోముడు బలరాముని మహిమను పురాణ కథల్లో తెలిసికొమ్మన్నాడు. కాకపోతే ఈ మాట అనే అవసరమే లేదు. ఇందులో గ్రహింపబడ్డ కథలు కూడా శ్రీకృష్ణ పరాక్రమాభివర్ణన, మహిమాభివర్ణనలను వ్యక్తంచేసేవే. కావ్యంలో ఏకవాక్యత సాధించడంకొరకు ఈవిధంగా గ్రహించడం అవసరమయిందిగూడా. ఈ కావ్యంలో ఒకే కథకాక వివిధకథలున్నా కూడా, వీటి అన్నింటిలో అనుస్యూతంగా ఉన్న శ్రీకృష్ణ పరాక్రమం, మహిమ అన్న విషయాలే ఏకవాక్యతను కావ్యానికి సాధించి పెడుతున్నవి.

కావ్యంలో పాత్రోన్మీలనమూ, కథాసంవిధానమూ ముఖ్యమైనవి. రసదృష్ట్యా దిద్ది తీర్చబడడం అవసరమనిముందే చెప్పబడింది. కావ్యం రసప్రధానమైంది కాబట్టి ఈతీర్చడం తప్పనిసరి. అందుకని రసానుగుణంగా, ఔచిత్య భంగంకలుగకుండా కథాసంవిధానంఉండవలసి ఉంటుంది. ఒకే కథ అయినప్పుడు కావ్యకర్తకు ఏవిధంగా వ్రాయడంలో కొంత సులువుఉంటుంది. కానిఉత్తరహరివంశంలాంటి వివిధ కథలు గల కావ్యాల రచనలో కవి చాలా నేర్పుచూపించవలసి వస్తుంది. వేరువేరుకథల్లోని వేరువేరు సంఘటనలూ, సంభాషణలూ... సర్వవిషయాలూ ప్రధాన విషయానికి ఔజ్జ్వల్యం కలిగించేవిగానే నిబంధింపబడవలసిఉంటుంది. మొత్తం కావ్యాంతర్గమైన ప్రధానవిషయానికి భంగం కలిగించే

ట్టుగా ఉన్నా, ఉపస్కారకంగా లేకున్నా, ఆ సంఘటన లేక ఆ సంభాషణ ఎంత అద్భుతంగా ఉన్నా, కావ్యం దెబ్బతింటుంది. ప్రధాన విషయం భంజింపబడ్డ తరువాత ఇవన్నీ ప్రత్యేకం ప్రత్యేకంగా ఎంత అందంగా, అద్భుతంగా ఉండికూడా ప్రయోజనం లేదు.

ఉత్తర హరివంశంలో ఉన్న సంవిధాన శిల్పాన్ని మనం గమనించితే, పరిశీలించితే, తద్వారా రసాదుల నిర్వహణను గూర్చి సులభంగా తెల్సుకోవచ్చు. అందుకని నాచన సోమనాథుని యొక్క కథాసంవిధానశిల్పం ఉత్తరహరివంశంలో ఎట్లా ఉందో పరిశీలించడం అవసరం.

కథాకథనం, లేక కథాసంవిధానం తెలుగులో రెండు మార్గాలుగా సాగినట్లు చెప్పవచ్చు. తక్కువ శబ్దాలను ఉపయోగించి, మహార్థాన్ని సాధించడం, రాబోయే విషయాన్ని పాత్రల చిత్తవృత్తి ప్రకాశసంద్వారా సంభాషణద్వారా, చేష్టలద్వారా సూచించడం మొదలైన లక్షణాలు గలది ఒకటి. ఇక కథలోని సంఘటనలను అంచెలంచెలుగా నిర్వహించడం, కవి తటస్థుడుగా ఉండి పాత్రల ద్వారానే కథ నడిపించడం, రంగకల్పన, నాటకీకరణ మొదలైన లక్షణాలుగలది రెండవది. మొదటిది నన్నయగారి మార్గంగా, రెండవది తిక్కనగారి మార్గంగా స్థూలంగా చెప్పవచ్చు. తెలుగులో ఎక్కువమంది కవులు తిక్కనగారి మార్గాన్ని స్వీకరించినవారే కనబడతారు. నన్నయగారి మార్గాన్ని అనుసరించినవారు చాలా తక్కువ. నాచన సోమనాథుడు తిక్కనగారి మార్గాన్ని అవలంబించినవాడు. ఇంకా అనేకవిధాలుగా, రచనలోనూ తిక్కనగారిని బహుధా అనుకరించినట్లు, లక్ష్యంగా పెట్టుకున్నట్లుగా ఉత్తరహరివంశాన్ని చూస్తే గ్రహించవచ్చు.

ఉత్తరహరివంశంలో నరకాసురవధ, విప్రబాలక ప్రాణదానం, కైలాసయాత్ర, పౌండ్రకవాసుదేవవధ, హంసడిభకవధ, బాణాసురబాహుఖండనం అనే ఆరు కథలు ఉన్నాయి. ఈ కథల్లో, కథల మధ్యలో కొన్ని అవాంతర విషయాలుకూడా చాలా ఉన్నాయి. సత్యభామాసమేతంగా నరకాసురవధ మొదలుగా, శివసాహాయ్యంగల బాణాసురదమనం వరకూ గల ఈ కావ్యంలో శ్రీకృష్ణుని వీరరసావతారం విస్తృతమైఉంది. కథలన్నిటిలోనూ – (హనన ఖండన విషయాల్లో) చక్రాన్నే ఉపయోగించడం సమానవిషయంగా గ్రహించబడింది. హరివంశ కథాప్రణాళిక ఈ విధంగా సమకూర్చబడింది.

ప్రథమాశ్వాసమంతా నరకాసురవధకు సంబంధించింది. ఇందులో ఊర్వశీ నరకాసురుల సంభాషణ, భూదేవిపుత్రదుఃఖం, సత్యభామాయుద్ధవర్ణనం అన్న అవాంతరవిషయాలు ఉన్నయి. మిగిలింది ముఖ్యకథ. అవాంతర విషయాలు ఎన్ని ఉన్నా, అవన్నీ ప్రధాన విషయాన్ని ఉద్దీపింపచేసేవీ, బలపరచేవిగానే ఉండాలిగాని, అవి పెరిగి ప్రధాన విషయాన్ని దెబ్బతీసేవిగా ఉండగూడదు.

పై అవాంతర విషయాలు మూడింటిలోని రెండవది: భూదేవి పుత్రదుఃఖంఅన్నది ప్రధాన కథకు ఉపస్కారకంగానే నిర్వహించబడింది. భూదేవి పుత్రమరణదుఃఖిత అయ్యీ కూడా అదితిదగ్గరనుండి నరకుడు హరించిన కుండలాలను తెచ్చి కృష్ణునికి అర్పిస్తుంది. దుష్టశిక్షణ, శిష్టరక్షణ అన్న దానిలో శ్రీకృష్ణుని స్వపరభేదం ఏమీ లేదనీ. నరకుడుతనపుత్రుడైనా-(విష్ణువుకీ భూదేవికీ కలిగినవాడు నరకుడు. శ్రీకృష్ణుడు విష్ణువుయొక్క అవతారంగా చెప్పబడ్డాడు.)

దుష్టుడు కాబట్టి సంహరించాడనీ ఆ మాటలవల్ల తెలుస్తుంది. ఇది శ్రీకృష్ణపాత్ర నుజ్జ్వలంచేయడానికి ఉపకరిస్తున్నది.

అసలు కథ ఇలాఉంది. నరకుడు తపస్సు చేసి, బ్రహ్మవల్లవరాలు పొందుతాడు. ఇంద్రాదులైన దిక్పాలకులను జయించుతాడు. మునులను బాధించుతాడు. అప్పుడు మునులయొక్క ఇంద్రునియొక్క ప్రార్థనల ననుసరించి శ్రీకృష్ణుడు నరకాసుర సంహారంచేస్తాడు. ఇక్కడి ఈ విషయాలన్నీ ఒకదానికొకటి కారణంగా ఉన్నాయి. వరప్రాప్తిగర్వాతిశయంతో దిక్పాలక విజయం, ఆఉత్సాహంలో దేవమిత్రులూ పూజకులైన మునులనుబాధించడం, తద్వారా కుపితుడైన శ్రీకృష్ణునిచే సంహరింపబడడం... ఇదీ వీటికున్న పరస్పర సంబంధం. కథచెప్పే నేర్పునుబట్టి, కథలోని సర్వవిషయాలూ ఈ విధంగా పరస్పర సంబద్ధాలై ఉండి, చివరకు ప్రధానలక్ష్యంలో పర్యవసిస్తాయి.

ఊర్వశీ నరకాసుర సంభాషణ మన్న అవాంతరవిషయం పై కథలో నాచనసోముడు కూర్చినాడు. ఈ సంభాషణఘట్టాన్ని అది ఉన్నంత పరిధిలోమాత్రమే చదివితే, పరమాద్భుతంగా, లోకోత్తరంగా ఉండవచ్చు. కాని ప్రధాన కథలో ఈ విషయం ఎంతవరకు సహకరించిందన్నదే పరిశీలించవలసిన విషయం.

ఈ ఘట్టంలో సోముడు ఇరవయ్యేడు పద్యాలను ఉపయోగించాడు. ఊర్వశీ నరకాసురుల ఉక్తిప్రత్యుక్తుల్ని ఇంతగా పెంచడం వల్ల ప్రధానకథకు సంబంధించిన ఏప్రయోజనమూ సాధింపబడలేదు. శ్రీ కృష్ణపరాక్రమాభివర్ణనమే ప్రధానంగాగల కథలో, ఊర్వశియొక్క పరమనాగరకతాలక్షణంగానీ, చతురవాగ్విలాసం కానీ, నరకుని మోటుదనం, అచతురవచస్కతలుగానీ ఎంతవరకు ఉపకరిస్తవి? ఈ ఘట్టంలో నరకుడు వట్టి కాముఅనీ, పరమానాగరకుడనీ, అచతురవచస్కుడనీ తేలింది. నరకసంహారానికి ఇవి కారణాలు కాదు. వాడు చేసిన హింస, అదీ బ్రహ్మదత్తవరగర్వంవల్ల. అదిన్నీ మునిబాధకు కారణం కావడం, ఇవన్నీ వాని సంహారానికి కారణాలు. వాడు వట్టి కాముకుడు కాబట్టి, అనాగరకుడు కాబట్టి మాత్రమే ఇవన్నీ వాడు చేయలేదు. అలాకాని రాక్షసులూ ఈ పనులు చేసే ఉన్నారు.

ఈ సంభాషణలో చివర ఊర్వశి నరకున్ని యజ్ఞభాగాన్ని పొందమనడం ముని హింసకు కారణంగా భాసించవచ్చు. అసలు మునిబాధకు ఈ ఊర్వశీవాక్యమే కారణంగా కానక్కరలేదు. నరకుని ఆసురీప్రవృత్తే అందుకు కారణంకావచ్చు. అయినా ఆప్రయోజనంవుండనే వున్నదనుకున్నా, ఆప్రయోజనం కొరకు ఈ ఘట్టాన్ని ఇంతపెంచవలసిన అవసరమేలేదు. ఎఱ్ఱన హరివంశంలో – అది పురాణమే అయినా–ఈ ప్రయోజనం రెండు పద్యాల్లోనే సాధింపబడింది. ఆ ప్రయోజనం కొఱకే ఉత్తరహరివంశంలో దాదాపు ఇరవయ్యేడు పద్యాలుపయోగించబడ్డాయి. ఈ ఘట్టంవల్ల నరకునికి ఊర్వశిపైన ఉన్న ప్రత్యేకాసక్తి వెల్లడిఅవుతోందనీ, దాన్ని అతడు ప్రేమించాడనీ కూడా అనుకోడానికివీల్లేదు. నరకుడు ఈ ఘట్టం తరువాత, అనేక దేవతాస్త్రీలను చెరబట్టుకవెళ్ళాడు. మునిహింసానంతరం ఒక్కసారైనా ఊర్వశీప్రస్తావన లేదు. ఈ ఘట్టం ఏ విధంగా కావ్యంలో ఏప్రయోజన్నా సాధించలేదు. పైగా ప్రతినాయకాపకర్షకుహేతువైంది. ఇది శృంగార రసాభాసం కావడంవల్ల ప్రధానరసమైన వీరానికీ అపకర్ష జరిగింది.

ఈ కథలో మరొక అవాంతర విషయం సత్యభామా యుద్ధవర్ణనం. సత్యభామ కృష్ణుని తో కలసి యుద్ధానికి వచ్చింది. ఆమెయుద్ధం కూడా చేసింది. అయితే ఆ యుద్ధవర్ణన శ్రీకృష్ణుని ఔద్ధత్యాన్ని అతిక్రమించేదిగా కుండా నేడుండాలి. అదిగాక వీరరసం ప్రదర్శించ వలసిన సందర్భంలో ఆమె శృంగారరసా వధిగా వర్ణింపబడింది. సత్యభామ యుద్ధం చేయడానికి పూనుకొన్నది సామాన్యునితో కాదు. ఇంద్రాది దిక్పాలకులను జయించిన నరకాసురునితో. ఆసందర్భంలో వర్ణించవల సింది ఆమెపరాక్రమాన్నే కాని, ఆమె హేలా విలాసాలనుకాదు. మొదట నరకుని బాణాలు సత్యభామాశరీరంపైన ఎనిమిదీ, ఎనిమిది విధాలైన పుష్పశృంగారం కలిగించి, ఆమె సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేసాయిట. మూర్ఛచేరిన శ్రీకృష్ణుడు సత్యభామకు యుద్ధం చేసే అవకాశాన్ని కలిగిస్తాడు. అక్కడి నుండి సత్యభామయొక్క యుద్ధవర్ణన ప్రారం భమవుతుంది. ఈ యుద్ధవర్ణనకు పద్దెనిమిది పద్యాలను ఉపయోగించాడు సోముడు. తరు వాత నాల్గయిదు పద్యాల్లో నరకాసురహన నం జరిగిపోతుంది. సత్యభామా యుద్ధవర్ణన ఇంతగా పెరగడంవల్ల శ్రీకృష్ణుని పాత్రకు ఔచిత్య భంగంకలిగింది. పైగా యుద్ధవర్ణన సందర్భంలో శృంగారవర్ణనచేయడం జరిగింది. ఈ విషయంలో సోముడు సంయమనంచూప లేక పోయినాడు. ఈ 'సంగరశృంగారం' తరు వాత చాలామంది కవులు అనుకరించారు. ఈ విధంగా పైవర్ణనలో శృంగారాన్నీ కల్పిం చడంవల్ల ప్రధానమైన వీరరసానికి భంగం కలుగుతున్నది. ఈ విధమైన వర్ణనలు పాఠ కుని మనస్సును రసాభిముఖంచేయడానికి బదులు అవ్యవస్థితంచేస్తాయి.

రుక్మిణికికూడా పూర్వం ఈయని భూషను సత్యభామకు శ్రీకృష్ణుడు ఇవ్వడం ఇక్కడి ఈ వర్ణనకు ప్రధానాశయంగా కనుపిస్తుంది. అయినా పై 'సంగర శృంగారా'న్ని కల్పించ వలసిన అవసరం లేదు. ఈ ఘట్టంలో కొన్ని పద్యాలు యుద్ధసామయికాలుగాకూడా అని పించవు.

అరిఁజూచున్ హరి జూచుఁ జూచుక
ములం దందంద మందారకే
సరమాలా మకరంద బిందు సలిల
స్యందంబులందంబులై
తొరగం బయ్యెద కొంగొకింత దొలఁగం
దోడ్తో శరాసారమున్
దరహాసామృతపూరముంగురియుచుం
దన్వంగి కేళీగతిన్.॥

ఇలాంటివి పద్యాలు. పద్యం అందంగా రచించడం వేరు. ఔచిత్యవంతంగా రచించ డం వేరు. ఔచిత్యం అనేది సందర్భాన్నిబట్టీ విషయాన్ని బట్టీఉంటుంది.

చతుర్థాశ్వాసం హంసడిభకుల కథను వర్ణించేది. చివర ఏ పది పదిహేను పద్యాలో తప్ప మొత్తం ఆశ్వాసమంతా వారికథనే వర్ణించుతుంది.

ఈ హంసడిభకులు సాల్వాధిపతిఅయిన బ్రహ్మదత్తుడి కుమారులు. శివప్రసాదంవల్ల వాళ్ళుజన్మించారు. మంత్రికుమారుడైన జనా ర్దనుడు విష్ణుప్రసాదంవల్ల జన్మించాడు. రాజ కుమారులయిన హంసడిభకులు అయిదేళ్ళు ఘోరమైన తపస్సుచేసి శివునిమెప్పించి వరాలు పొందుతారు. తరువాత మంత్రికు మారుడితోసహాముగ్గురికీ పెళ్ళిళ్లుఅవుతాయి. వాళ్ళందరూ ఏకపత్నీవ్రతస్థులుగా జీవి తాన్ని గడుపుతూఉంటారు. ఈవిధంగా 'వర ప్రసాద సమ్మదభరిత హృదయులై, నిజజనక

రాజ్యవిభవంబు విలసిల్లం జేయుచు వీరాభిమాన విజృంభితులై' ఉంటుంటారు.

ఇదంతా చెప్పడమెందుకంటే, ఇంతవరకూ హంసడిభకులు సద్గుణాలుగల రాజకుమారులుగా, వేదశాస్త్ర పురాణాదివేత్తలుగా, తపశ్శుద్ధులుగా చిత్రింపబడ్డారు. వాళ్ళల్లో దైత్యస్వభావం ఏమాత్రమూ చెప్పబడలేదు. వాళ్లు 'అఖిలధరణిఁ బెరుఁగు కంటకకోటి'గా కూడా ఏమీ చెప్పబడలేదు. వాళ్ళు వరప్రసాదసమ్మదభరితులైనారనేది సామాన్యవిషయం. వరాలుపొందిన వారందరివలె వాళ్లూ ఉత్సాహవంతులైనారు. అంతే. అది కారణంగా వాళ్ళుచేసిన క్రూరకార్యాలేవీలేవు.

వాళ్లొకనాడు జనార్దనునితోసహా వేటకు వెళ్ళారు. వేటాడి అలసిపోయి చెట్లనీడల్లో కూర్చున్నారు. అప్పుడు వాళ్ళకు "మాధ్యందినసవనధ్వని విద్యుక్త స్వనముతోడ" వినవచ్చింది. వాళ్ళు స్వాధ్యాయపరులు. ఆకారణంగా ఆ స్వరంచే ఆకృష్టులై దగ్గర ఏదో మున్యాశ్రమం ఉందని తెలిసికొని అక్కడికి వెళ్ళారు. అప్పుడు వారి మనస్సులో ఏసందేహమూ లేదు, దురుద్దేశమూ లేదు. వెళ్ళి సభాచార్యులకు నమస్కరించి, ఆ కశ్యపప్రభృతులను తమ తండ్రిచేసే రాజసూయ యాగానికి రమ్మని ఆహ్వానించారు. యాగం ప్రారంభమయ్యేప్పటికి వస్తామనివాళ్ళన్నారు. హంసడిభకులు మరలివచ్చారు. అ తరువాత పుష్కరసరస్తీరాన్యా ప్రదేశంలో దూర్వాసుని చూచారు.

ఇంతవరకు వాళ్ళప్రవృత్తి సన్మార్గంలోనే ఉంది. ఇక్కడ హఠాత్తుగా మారింది. సన్యాసులందరూ వ్యర్థులు, మోసగాండ్రు. గృహస్థాశ్రమం చాలాగొప్పది. ఇది ఇప్పటి హంసడిభకుల ఉద్దేశ్యం. ఈ ఉద్దేశ్యం వాళ్ళకు కలగడానికి కారణమేమీ కనుపించదు. వాళ్లు దూర్వాసుని నోటికొచ్చినంత దురుసుగా దూషిస్తారు. అవమానంచేస్తారు. హంసడిభకులు స్వయంగా ఐదేళ్ళు "నీరును గాలియును ద్రావి నిర్మలతర చేతోరాజీవభ్రమరము గౌరీపతిఁ దలఁచి నిష్ఠగైకొని తపస్సు చేసినవాళ్ళు. అలాంటితపశ్శక్తి నెరిగిన వాళ్ళకు ఈ భావాలు కలుగడం, తద్వారా దూషించడం అవమానం చేయడమనేవి చేయాలనిపించడం చాలా విడ్డూరంగా, అనిపిస్తుంది. అంతవరకు వాళ్ళను చిత్రించిన పద్ధతికి ఇది వ్యతిరేకంగా, అదీన్నీ హఠాత్తుగా జరగడం, అసంబద్ధంగా ఉంది. వరగర్వంవల్ల వీరిల్లాంటి పనులుచేసారనీ అనవచ్చు. కాని అంతకు కొంచెం ముందే కశ్యపాశ్రమంలో వారిప్రవర్తన శిష్టజనోచితంగాఉంది. దూర్వాసుని తమ కిష్టమైతే, కశ్యపాదులను యజ్ఞానికి ఆహ్వానించినట్లు ఆహ్వానించవచ్చు. లేదా తమదారిన తాము పోవచ్చు. కాని కశ్యపాశ్రమానికీ, పుష్కరసరస్తీరానికీ మధ్యఉన్న అతితక్కువ కాలవ్యవధానంలో ఈ మార్పుచాలా అసహజమైంది. ఈ విధమైన రెండురకాల ప్రవర్తనకు ఎక్కడా సమన్వయం కుదరడం లేదు. దీనివల్ల పాత్రోన్మీలనం దెబ్బతిన్నది. కథాసంవిధానమూ కుంటువడింది.

జనార్దనుని రాయబారంకూడా ఈ విధంగానే దెబ్బతిన్నది. ఈ రాయబారఘట్టాన్ని భారతంలోని సంజయ రాయబారానికి పోల్చడం జరుగుతున్నది. కాని ఆ పోలిక ఏమాత్రమూ సంబద్ధంకాదు. సంజయ రాయబారంలోని ఉదాత్తత జనార్దనుని రాయబారంలో లేశమైనా కనుపించదు. అసలీ రాయబారం రాయబారంగానే అనిపించదు. ఒకభక్తుడు స్వామిదర్శనంకోసరమే వెళ్ళినట్టుందిగాని, ఒక

రాచకార్యాన్ని నిర్వహించడంకోసం ఒక రాజనీతిజ్ఞుడు వెళ్ళినట్టులేదు. సంజయరాయబారం నిర్వహించే సందర్భంలో ఎంతో సంయమనం ప్రదర్శించబడింది. సంజయుడు సహజంగా పాండవపక్షపాతి అయినాకూడా, అతనిమాటల్లో ఎక్కడా అది పైకిరాదు. ఎంతసేపటికీ, ఆయన ఏది సాధించుదామని వచ్చినాడో, అదే అతని సర్వసంభాషణలో గోచరిస్తుంది. సంజయుడూ ధర్మరాజూ పరస్పరం గాఢంగా విమర్శించుకొంటారు. సంజయుడు రాయబారిగా తన కర్తవ్యాన్ని తాను సరిగ్గా నిర్వర్తించాడు. జనార్దనుడా పని చేయలేకపోయినాడు. సంజయరాయబారంలో తిక్కన ప్రదర్శించిన సంయమనం ఈ సందర్భంలో సోముడు ఎంతమాత్రమూ ప్రదర్శించలేకపోయాడు. జనార్దనుడు రాయబార సమయంలోకూడా భక్తుడుగానే కనిపిస్తాడు. శ్రీకృష్ణుసంతతి మహిమాస్పదుడుకూడా సామాన్య క్షత్రియరాజువలెనే వీరాలాపాలు చేస్తాడేకాని, అతనిలో ధర్మరాజులోని సంయమనం, ఉదాత్తత కనుపించవు.

ఈ కావ్యంలో అన్నిటికంటే పెద్దకథ బాణాసురదమనం. పంచమాశ్వాసంలో ఈ దమనానికి కారణమైన ఉషాపరిణయగాథ ఉంటుంది. షష్ఠాశ్వాసంలో అసలుకథ ఉంటుంది. ఈ ముఖ్యవిషయంలో, బాణాసురదమనంలో ఉషాపరిణయ గాథ నిజంగా కారణం కాగూడదు. ఎందుకంటే ఈ కారణం కృష్ణునికి సంబంధించిందే. ఇతరకథల్లో, దేవతాబాధ లేకమునిబాధ, లేకమరొకటి దుష్టసంహారానికి కారణమవుతున్నది. ఈ గాథలో అల్లాకావడం లేదు. బాణుడు జన్మతః అసురుడు కావడం, తప్పవిడిచి వాడుచేసిన దైత్యకార్యాలేవీ చెప్పబడలేదు. అత డీశ్వరుని కోరిన కోరిక కూడా చిత్రమైంది. తనను కొడుకుగా స్వీకరించి తనను కాపాడమన్నాడు. ఈశ్వరుడు దాని కంగీకరించి వానికి గాణాపత్యం కృప చేస్తాడు. బాణుడు చాలామంది రాజులను జయించి రాజ్యం చేసుకుంటూ ఉంటాడు. 'దనుజ శోభనకరుడై' ఉంటాడు. దనుజశోభనకరుడై అనేది ఎంతో దూరంగా ఆలోచిస్తే తప్ప బాణుడు దుష్కార్యాలుచేసి ఉంటాడని అనడానికి వీల్లేదు. అయితే శ్రీకృష్ణుడు బాణాసురుని నిగ్రహించడానికి ప్రత్యక్షకారణం, బాణుడు అనిరుద్ధుని బంధించడం మాత్రమే అవుతుంది. అనిరుద్ధుడు శ్రీకృష్ణునికి మనుమడు. అందుకని మనుమనికోసం బాణాసురునిమీదికి వచ్చాడు. అంతే. ఇందులో ఇతరకథలవలె దుష్టశిక్షణ శిష్టరక్షణ అన్న విషయం ఏదీ కానరాదు. అందువల్ల ఇతర కథలకూ ఈ కథకూ పొత్తుకుదరడం లేదు.

నిజానికి పంచమాశ్వాసంలోని గాథ షష్ఠాశ్వాసంలోని బాణాసురదమనగాథకు కారణమేఅయినా ప్రత్యేకకథగా నిర్వహింపబడి ముఖ్యవిషయానికన్నా పెరిగిపోయింది. ముఖ్యగాథకు కారణంగా ఈగాథ ఉన్నప్పుడు, ఇది ముఖ్యగాథకన్నా పెరిగి ప్రాధాన్యం వహించకూడదు. దీనికి ప్రాధాన్యం రావడంవల్ల ప్రధానకథయొక్క ప్రాధాన్యం తగ్గిపోతుంది. ముఖ్యగాథ బాణాసురదమనమేగాని ఉషాపరిణయగాథకాదు. జనమేజయుడడిగిందీ, వైశంపాయనుడు చెప్పడానికి ప్రారంభించిందీ బాణాసురదమనగాథనే మరి. కాని ఉషాపరిణయగాథకు మూడువందలకుపైగా పద్యాలను ఉపయోగిస్తే, బాణాసురదమనగాథకు రెండొందల యాభై పద్యాలకు పైగా మాత్రమే ఉపయోగించాడు సోముడు.

ఈ ఉషాపరిణయగాథ ఇంత పెరగడానికి కారణంఉంది. దీనిలో ఇందుధరోపాఖ్యానం, ఉషావిరహవర్ణనం, అనిరుద్ధబాణాసురుల యుద్ధవర్ణనం అనే అవాంతర విషయాలున్నవి. ఇందుధరోపాఖ్యానంలో పందొమ్మిదీ, ఉషావిరహవర్ణనలో పదీ, అనిరుద్ధ బాణాసుర యుద్ధవర్ణనలో నలభైతొమ్మిది పద్యాలు ఉపయోగించడమైంది. ఈ పద్యాల లెక్కలు ప్రత్యేకంగా చెప్పడానికి కారణం, వీటియొక్క ఈ పెరుగుదలలు ప్రధాన విషయానికి ఉపస్కారకంగా లేకపోవడమే. మొత్తం ఉషాపరిణయంలో అనిరుద్ధ బంధనమే ముఖ్యవిషయం. అదే తరువాతి దానికి కారణమవుతున్నది. అనిరుద్ధ బాణాసురుల యుద్ధవర్ణన అవసరమే అయినా అంత పెరుగవలసిన అవసరంలేదు. తరువాతి ముఖ్యగాథలో ముఖ్యుల యుద్ధవర్ణనకూ దీనికీ చాలా భేదంఉండాలి. ఇది దాన్ని మించిపోయే వీలు ఏమాత్రమూ ఉండకూడదు. అదీగాక, అనిరుద్ధుని ప్రతాపంతో కథకుగానీ, కావ్యానికిగానీ ఏమీ సంబంధం లేదు. శ్రీకృష్ణప్రతాపాభివర్ణనతోనే సంబంధం. అందువల్ల ఇది సంక్షేపంగానే ఉండడం అవసరం. అల్లాలేకపోవడంవల్ల ప్రధాన కథకు ఈ ఉషాపరిణయ గాథ ప్రాధాన్యం తగ్గిస్తోంది. ఈవిధంగానే చూస్తే, ఇందుధరోపాఖ్యానం, ఉషయొక్క విరహవర్ణనం ఎంత సంక్షేపంగా ఉండాలో ఊహించుకోవచ్చు.

మరొకలోపమూ జరిగింది ఈ కథలో. అనిరుద్ధుడు కొన్నాళ్ళు ఉషాదేవితో గడిపిన తరువాతే, అతని విషయం బాణాసురునికి తెలిసింది. అప్పుడు బాణాసురుడు అనిరుద్ధుని బంధించడము జరిగింది. ఇది పంచమాశ్వాసంలో ఉన్నవిషయం. ఇకషష్ఠాశ్వాసంలో శ్రీకృష్ణుడు మొదలైన వాళ్ళు అనిరుద్ధుని కోసరం వెతుకుతూఉన్న సందర్భంలో నారదుడు వస్తాడు. వాళ్ళ విచారానికీ, ఆదుర్దాకూ కారణం అడుగుతాడు. అప్పుడు శ్రీకృష్ణుడు "మునినాథ! చెప్పఁజిట్టలు, మన యనిరుద్ధుండు నిన్నమగువలుగొలువ దనయింట నెమ్మదినునికిగలిగెఁబిదపనున్నయునికిన యడఁగెన్" అనిఅంటాడు. దానికి సమాధానంగానారదుడు "...... అద్భుతారావరణంబు జూచితిమి రాత్రి నిజం బనిరుద్ధబాణబాణావళిచేత నాదితిసుతాత్మజకై చెలి చిత్రరేఖ సంభావన నక్కుమారవరుఁబట్టుట, నయ్యుష వాని ముట్టుటన్" అని బాణాసురానిరుద్ధుల పరస్పర యుద్ధాన్నిగూర్చి చెప్పుతాడు. ఇది కుదరని విషయం. అనిరుద్ధుని అపహరణం జరిగినరాత్రే అనిరుద్ధ బాణాసురులకు యుద్ధం జరుగలేదనేది నిశ్చయమైన విషయం. తరువాత కొన్నాళ్ళకుజరిగింది. అయితే అనిరుద్ధాపహరణం జరిగిన మరుసటిరోజే నారదు డీవిధంగా చెప్పడంవల్ల ఉభయాశ్వాసాలలోని విషయాలకు సమన్వయం కుదరడంలేదు. ఈ విధమైన సమన్వయం కుదరని విషయాలు కథాసంవిధానంలోని లోపాలను చేయెత్తి చూపిస్తుంటాయి.

ఈ కావ్యంలో ఈ విధమైన లోపాలు జరగడానికి కొన్ని కారణా లిలా చెప్పవచ్చు. కొత్తవి చెప్పాలన్న ఉబలాటంలో అనవసరంగా ఘట్టాలను ఎక్కువగా విస్తరించడం సంఘటనలమీదే తప్ప పాత్రోన్మీలనమీద దృష్టి లేకపోవడం, ప్రధాన ప్రతిపాద్యానికి అనుగుణంగా కథలను చెప్పాలనే శ్రద్ధ లేకపోవడం, ఆవేశం ఎక్కువఅయి సంయమనం తగ్గడం. స్థూలంగా ఇవి కారణాలు.

వీటన్నిటి కారణం నాచన సోముడు ఎంత కవితాశక్తి కలవాడే అయినా మహా

కావ్యనిర్మాత కాలేకపోయినాడు. తద్వారా మహాకవి కాలేకపోయినాడు. కాని కవితా శక్తి దృష్ట్యా తెలుగులో ఏ ఇద్దరు ముగ్గురు కవులను తప్ప మిగతా సర్వకవులకన్నా అధికుడు నాచన సోముడు. ఉత్తమకవి. ఆయన ఉత్తమకవిగా స్థిరుడు. కవితాశక్తిని పరిశీలించాలంటే, పద్యరచన, శైలి, కల్పన, చమత్కారజనక వాక్యరచన, పదప్రయోగం మొదలైనవి పరిశీలించవలసి ఉంటుంది. అవి ఆయన యొక్క ఉత్తమకవి లక్షణాన్ని నిరూపిస్తవి.

# సాహిత్యధార

కవిత్వాన్ని గురించిన అభిప్రాయభేదాలు ఎప్పుడూ ఉండనే ఉన్నవి. తమతమ సిద్ధాంతాలు నిలబెట్టటానికి వారువారు పెద్దపెద్ద గ్రంథాలు వ్రాసికొన్నారు. బాగా వాదించారు. ఈ కాలంవాళ్ళుకూడా తమ అభిప్రాయభేదాలను ప్రకటించి వాదిస్తున్నారు. ఆ వాదనకూ ఈ వాదనకూ భేదమేమిటంటే వాళ్ళవాదన లోక పద్ధతినీ ప్రమాణాన్నీ ఆశ్రయించినవి. నేటివాళ్ళ వాదాలకు ఒక పద్ధతీ ప్రమాణం లేవు.

ఒకే భగవద్గీతకు వివిధాచార్యులు వివిధార్థాలు ప్రవచించారు. ఎల్లా? అక్కడ ఉన్న శబ్దాలకు ఫలానా అర్థం అని ఒకరు చెపితే అదికాదు ఇది అని మరొకరు చెప్పారు. ఆ శబ్దానికి వ్యుత్పత్తి నిర్ణయించటంలో తగాదాలు పడ్డారు. ఈ శబ్దం ఈ ధాతువులోనుంచి పుట్టింది అని ఒకరంటే కాదు ఇంకొక ధాతువులోనుంచి పుట్టిందని మరొకరన్నారు. ఈ శబ్దానికీ అర్థం అని నాకు తోస్తున్నది కాబట్టి ఇదే నిజం అని వారనలేదు. నా ఇష్టం వచ్చిన అర్థం నేను చెపుతాను, నా ఇష్టం వచ్చినట్లు నేను వ్రాస్తాను, అడగటానికి నువ్వెవ్వడవూ అని వారనలేదు. వ్యవస్థకూ అవ్యవస్థకూ ఇదే భేదం. వ్యవస్థ ఒక ప్రమాణాన్ని ఆశ్రయిస్తుంది. అవ్యవస్థ ఒక ప్రమాణాన్నీ ఆశ్రయించదు.

కొన్ని పరమప్రాథమికములైన విషయాలనుగురించి అభిప్రాయభేదం ఉండటానికి వీల్లేదు. నేను నిజం చెపుతున్నాను. మా హైస్కూలు సహాధ్యాయి ఒకడు కొత్తకవిత్వం వ్రాసి 'గజ్జ' అనే శబ్దం వాడాడు. ఆ శబ్దానికి దగ్గర హంసపాదు వేసి అధస్సూచికలో 'సిగ్గు' అని అర్థం వ్రాశాడు. ఏమిటిరా ఇది అంటే ఆదంతే అంటాడు. నీవుచెప్పిన అర్థమే నిజంకాని నేను చెప్పిందికాదా అంటాడు. మేమంతా వాణ్ణి పిచ్చివానికింద లెక్కకట్టాములెండి. కొత్తదనపు గజ్జికొందరికి అంతగా ఉంటుంది.

కావాలని బలవంతంగా ప్రవేశపెట్టబడిన కొత్తదనం ఎప్పుడూ నిలబడదు. కాలక్రమేణ కొన్నిశబ్దాలకు అర్థాలు మారుతూ ఉంటవి. కొన్ని ప్రయోగంలోనుంచి ఉపసంహరింపబడుతవి. కొత్తశబ్దాలు భాషలో ప్రవేశిస్తవి. ఒక మనిషి కావాలనిచేసిన ప్రయత్నానికి ఫలితాలుగా ఇవన్నీ రాలేదు. క్రొత్తదనానికి దాని సహజమైన గతి దానికున్నది. అది వసంతకాలములో కోకిలగొంతు విచ్చుకోవటం వంటిది. ఆ మధురస్వరము దేనినో ఎవరినో ఆలంబంగాచేసికొని జనిస్తుంది. అది సృష్టింపబడదు. అట్టి సహజమైన క్రొత్తదనానికి తెలుగుదేశంలో తిరుపతి వేంకటేశ్వరులాలంబమైనారు. క్రొత్తదనాన్ని సృష్టించటానికి భావకవులు ప్రయత్నిస్తే 'దారుణ దివాంధరోదన ధ్వనులు' బయలుదేరినవి. అసహజంగా క్రొత్తదనాన్ని సృష్టించే మరో ప్రయత్నం అభ్యుదయకవులు చేశారు. ఈ ఉభయుల దుస్థితీ కనబడుతూనే ఉన్నది.

జబర్దస్తీగా క్రొత్తదనాన్ని సృష్టించటానికి ప్రయత్నిస్తే పుట్టేది క్రొత్తదనం కాదు. అవ్యవస్థ.

అభిప్రాయ భేదాలున్న ప్రతిచోటా అవ్యవస్థ ఉండవలసిన అవసరంలేదు. పాటించవల

సిన కనీస ప్రమాణాలు పాటించటం వదలిన చోటినుండి అవ్యవస్థ పుడుతుంది.

దుష్టప్రభువు ఒక దుష్టశాసనం చేస్తాడు. మనం శాసనోల్లంఘనం చేస్తాము. ఆ శాసనోల్లంఘనంకూడా కొన్ని ప్రమాణాల నాశ్రయిస్తుంది. రైలులో టిక్కట్టులేకుండా ప్రయాణంచేయడం శాసనోల్లంఘనం కాదుకదా? ఎంత శాసనోల్లంఘనోద్యమమైనా రోడ్డుమీద కుడిప్రక్కగా బండితోలుమని చెప్పదు. తోలితే కలిగే అనర్థం ప్రత్యక్షంగా కనపడుతుంది. అప్పటికప్పుడు కనపడుతుంది. సాహిత్యంలో రేగిన అవ్యవస్థయొక్క అనర్థాలు అంత ప్రత్యక్షంగా కనపడవు.

క్రొత్తదనానికీ వ్యవస్థకూ ఎప్పుడూ విరోధం లేదు. ఉన్నదని కొందరి భ్రమ.

కొంతమంది విపరీతులు సృష్టిలోఎప్పుడూ ఉంటారు. వ్యవస్థకు తాము శత్రుత్వం వహించటమేకాదు, దాన్ని పాటిస్తూ తమ దారిని తాము పోయేవాళ్ళను చూచినా వీళ్ళకు కోపంవస్తుంది. ఇంత క్రొత్తదనం, ఇంత స్వాతంత్ర్యం కావాలని వాదించే తమను మాత్రం స్వతంత్రించి ఎవ్వరూ ఏమీ అనకూడదు.

'పాతరాతి యుగం మనుష్యులు,' 'మూడు కాళ్ళ కుందేళ్ళహక్కుదారులు' 'పెట్టుబడిదారీ విధానానికి పెట్టనికోటలు' ఇవంతా గురజాడని అకవి అన్నవాళ్ళకు 'మందలింపు' అట. వీటన్నిటికీ ప్రతిగా అన్న 'మురికికాలువలయుగం' మనుష్యులు అన్నమాట 'ఉద్రేకం' అట! సామాన్య బుద్ధికి తోచేదేమంటే అయితే రెండూ ఉద్రేకాలుకావాలి. లేకపోతే రెండూ మందలింపులే కావాలి. పైగా ఎక్కువమాటలన్న వాడిది ఎక్కువ ఉద్రేకంకావాలి. కాని ఒకే రకమైన రెండు మాటల్లో ఒకటి మందలింపుకిందా రెండవది ఉద్రేకంకిందా ఎల్లా చేరుతుంది? రెండింటినీ వేరువేరుగా చెప్పటమంటే మన బుద్ధి ఎల్లప్పుడూ ఒకే లాగాపనిచేయదని అర్థం. అప్పుడప్పుడది ముడుచుకపోతుంది. లేకపోతే గిడసబారుతుంది. లేకపోతే పక్షపాతపు దళసరి తెరలచేత కప్పుకపోతుంది.

వచ్చిన చిక్కంతా ఈ పక్షపాతాలతోనే వచ్చింది. అవతలివాని మాటలలోని యాథార్థ్యం కనపడదు. వాని ఉద్రేకం కనుపడుతుంది. కానిలోకానికి మన పక్షపాతం సంగతి కూడా వెల్లడౌతుంది. ఎవరికివారు తాము నిర్మించుకున్న 'రూలు' నే పాటించండి. కాని ఆ 'రూలు' ను అందరి యెడా సమానంగా ప్రయోగించండి. అవసరాన్నిబట్టీ వ్యక్తులనుబట్టీ రూలు పొడవును ఎక్కువ తక్కువచేస్తే చిక్కులు వచ్చి పడతావి.

అసలు విషయమేమిటంటే దూషణ ఉన్న చోట ప్రతిదూషణ ఉంటుంది. ఉండకూడదనటం నీతికావచ్చును. ఉండటంమాత్రం యథార్థం.

శ్రీశ్రీ కవిత్వాన్ని గురించిన అభిప్రాయభేదాలెలాఉన్నా, ఆయనకు కొంతమంది అనుయాయులున్నారన్న విషయంలో అభిప్రాయభేదం లేదు. ఆయన ఒక కవితాపద్ధతికి, అది ఎలాంటిదైనాసరే, మార్గదర్శి అనే విషయంలో అభిప్రాయ భేదం లేదు. అల్లాంటి నాయకుడు ఎక్కువ బాధ్యతతో మాట్లాడవలసిఉంటుంది. బాధ్యతవదలి తానే ఉద్రేకానికి లోబడ్డప్పుడు కుఱ్ఱవాళ్ళ సంగతి చెప్పవలసిన అవసరంలేదు. ఆయనది 'మందలింపు' ఇతరులది 'ఉద్రేకమా'? అవును మరి. గురువుగారి ఉంపుడుకత్తె పేరు అంతరంగిక భక్తురాలు.

కాని అయ్యా! ఎవరికవిత్వంలో దూష

ణకు ప్రాధాన్యమున్నదో మీరే చెప్పండి. దాపరికమెందుకు? మహాప్రస్థానమున్నది. ఎంత తిట్టుబోతైనా తనకిష్టంకాని వాళ్ళందరినీ 'దొంగలంజ కొడుకు' లని మరెవ్వడూ తిట్టలేదు కేవలం తిట్టుకవుల సంగతికాదు నేను చెప్పేది. మర్యాదస్థులైన కవుల సంగతి చెపుతున్నాను. మర్యాదఉండటంకూడ పూర్వాచారపరాయణత్వమే అనండి. అక్కడికి సరిపోతుంది. ఆవేశం పేరుమీద సాహిత్యంలో యధేచ్ఛంగా ఇతరులను తిట్టినవాళ్ళు అభ్యుదయ కవులు.

సమాజపరిస్థితులు అనేకుల నైరాశ్యానికి కారణమవుతున్నాయి. ఉత్తమప్రకృతి ఆ నైరాశ్యాన్ని ధైర్యంగా ఎదుర్కొంటాడు. అధముడు చేతకానికోపాన్ని ప్రకటిస్తాడు. ఇన్ని తిట్లూ అశక్తమైన కోపంలోనుంచే పుట్టుకొస్తవి. అల్లాగే తిడతామంటారూ. తిట్టండి.

గురజాడ అప్పారావుగారిని ఆయన అకవి అన్నాడు. అంటే ఏం? ఎందుచేత అనకూడదు? వాక్స్వాతంత్ర్యానికి చివరి హద్దులు చూచివచ్చిన వీళ్ళకి ఆమాట ఎందుచేత కోప కారణం కావాలి? పైగా ఇందుచేత అంటున్నానయ్యా అని ఆయన కారణాలుకూడా చూపించాడు. కాదు ఏకారణం లేకుండా అన్నాడనే అందాం. ఒక ఇరవైఏళ్ళనుంచీ వీళ్ళు ప్రబంధకవులను తిట్టిన తిట్లలో, ధిక్కరించిన ధిక్కరింపులో ఆయన అన్నమాట ఏభాగం క్రిందకు వస్తుంది? విమర్శించే అధికారం దూషించే అధికారంతోకూడా కలిసి వీళ్ళకు ఉండాలి కాని ఇతరులకుండ కూడదా? ఇదివరకు రాజుల కున్నటువంటి 'పవిత్రాధికారాలు' తమకేమన్నా కావాలని వీళ్ళ అభిప్రాయమా?

మళ్ళీ శతాబ్దాలుగా నలిగిన మాటలూ వీళ్ళే ప్రయోగిస్తారు. నానృషిఃకురుతే కావ్యమ్ విశ్వశ్రేయఃకావ్యమ్. మొదలైనవి. ఋషి అంటే ఎవరు? శ్రేయస్సంటే ఏమిటి? అంటే మాత్రం మళ్ళీ గొంతులో నెలకాయ పడుతుంది. ఏమిటో మాకెందుకు? మేమేది కావ్య మనుకుంటామో అది వ్రాసినవాడు ఋషి. వాడు ద్రష్ట.

ఒక కథఉన్నది. వెనుక ఒక కాబూలీ వాడు తెలుగుదేశం వచ్చి మంచిరుచిగల మామిడిపండు తిన్నాడట. తిరిగి తన దేశం వెళ్ళిన తరువాత ఆ మామిడిపండ్లనుగూర్చి ఘనంగా ప్రసంగించాడు. అక్కడి వాళ్ళంతా వెంటపడ్డారు. మామిడిపండు రుచి ఎల్లాఉంటుందో చెప్పమని. వాడు సరేనని ఒక పెద్దగడ్డంవాణ్ణి ముందుకు రమ్మన్నాడు. ఒక చింతపండు లాంటి వస్తువును వానిగడ్డానికి బాగా పట్టించాడు. ఆ తరువాత పలుకని బెల్లంపట్టించాడు. ఒకొక్కక్కణ్ణే వచ్చి వానిగడ్డం చీకమన్నాడు. ఆ గడ్డం చీకి మామిడిపండురుచి వాళ్ళు తెలుసుకున్నారు.

ఆ గడ్డం చీకుడుగాళ్ళకు మామిడిపండు రుచి ఎంత బాగా తెలిసిందో విశ్వశ్రేయస్సూ ఋషీ, ద్రష్టా మొదలైన మాటలసంగతి వీళ్ళకూ అంతే బాగా తెలిసింది.

'సప్తార్చి'